# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 రాజమహేంద్రవరము 1-9-1980 సంచిక 21


— ఈ సంచికలో —



16—9—1980 సంచికలో కవికర్ణ రసాయనము – పరిశీలనావశ్యకత, జాషువా ఎలెజీ – బాపూ బాపురెడ్డి గేయాలు, జానపదుల ప్రణయం మొదలగునవి ఉంటాయి.

— 1, 16 తేదీలలో ప్రచురింపబడును —


చందా :
సంవత్సరమునకు రు. 10—00.
అర్ధసంవత్సరమునకు రు. 5—50.

విడిప్రతి 50

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము ౮ | రాజమహేంద్రవరము 1-9-1980 | సంచిక 21

## శారదాధ్వజము

— 'భాషాప్రవీణ' కుమారి నందిరాజు కల్యాణి, పి. ఒ. ఎల్., ఎం. ఏ

నాయక రాజులలో కడపటి వాడైనను పూర్వులకన్న మిన్నగా సారస్వత పరిపోషణ గావించిన మహారాజకవి లలితకళాపోషకుడు శ్రీ విజయరాఘవ నాయకుడు. ఇతడుకూడ శ్రీకృష్ణదేవరాయలవలె రఘునాథరాయల వలె తన ఆస్థానమున అనేక మహాకవులను పోషించిన సారస్వత ప్రియుడు. కేవలము మహాకవులనే కాదు కవయిత్రులను కూడ సమాన దృష్టితో సమ్మానించిన సాహితీ ప్రియంభావుకుడు.

విజయరాఘవుని ఆస్థానము నలంకరించిన విదుషీమణులలో మేటి రచయిత్రి రంగాజమ్మ. ఈమె సంగీత సారస్వతముల రెండింటిని కరతలామలకములు గావించుకొని; నాట్యవిద్యయందారి తేరి విజయరాఘవ నాయకుని శారదాధ్వజము నధిష్ఠించినది. రంగాజమ్మ మన్నారుదాస విలాసమును రచియించి విజయరాఘవునకు అంకిత మొసంగినది. ఇదియే కాక ఈమె రచించినవి ఉషాపరిణయము, రామాయణ కథా సంగ్రహము; భారత కథా సంగ్రహము, భాగవత కథాసంగ్రహము; మొదలగు గ్రంథములు. మన్నారుదాస విలాసము తక్క తక్కినవన్నియు నామావశిష్టములే. మన్నారుదాస విలాసమును ప్రబంధముగాను; యక్షగానముగాను రచించుటలోని తాత్పర్యము పండిత పామర జనరంజకత్వమే కాబోలు.

ప్రకృతము మన్నారుదాస విలాసము అయిదాశ్వాసముల ప్రబంధము. ఈ ఆశ్వాస విభజనయందు ఒకానొక విశేషము నాయూహ కందుచున్నది. అది ఇది కావ్యమునకు ప్రధాన రసము శృంగారమని పెద్ద లందరుద్ఘోషించినారు కదా! ఆ శృంగార రసాధిదేవత మన్మథుడు కదా! ఆ మదనుని ఆయుధము అయిదు. ఆ స్ఫూర్తిని కలిగించుటకే రంగాజమ్మ యిట్లు చేసియుండును. ఇది సామాన్యమే.

ఈసందర్భమున నాదొక విజ్ఞాపనము. ఈ గ్రంథ రచనను పురస్కరించుకొని ఆలోచింపగా ఈమె సిద్ధాంతము విశిష్టాద్వైతముగా గోచరించుచున్నది. ఆది కావ్యమునందు ఆశ్వాస విభజన నుండి అంతమువరకు ఉదాహరణములను కొన్నింటిని మాత్రమే పేర్కొనుచున్నాను. ఈ అయిదాశ్వాసములు శ్రీ మహావిష్ణువు యొక్క పంచాయుధములను తలపించుచున్నవి. ఇట్లు రక్తిభక్తులను సమన్వయ పురస్సరముగా తన ప్రబంధము నందు నిబంధించిన దీ రంగాజమ్మ ఒక్కతెయే.

గ్రంథారంభమున ఇష్టదేవతాస్తుతి యందు ఒక విశిష్టత కనపడుచున్నది. ఈ స్తుతియందు అచ్చమైన విశిష్టాద్వైత సంప్రదాయము తొంగిచూచుచున్నది. ఈమె ముందుగా చెంగమలాంబికను ప్రార్థించినది. తరువాత రాజగోపాలకుని సేవించినది. ఆ చెంగమలాంబిక యీరాజగోపాల విభుని హృదయాధిష్ఠాన దేవత. ఆ దేవి యనుగ్రహము లేనిదే స్వామికి మన విన్నపము అందదుగదా! వైష్ణవ సంప్రదాయ మందలి విరాట్పురుషాకారమన నిదియే. ఆసిద్ధాంతము నందలి లోతుపాతులు చక్కగా తెలిసిన రంగాజమ్మ తనగ్రంథమునందు సందర్భము వచ్చినపుడెల్ల ఆ సిద్ధాంతమును చొప్పించినది.

ఇక రెండవ పద్యములో శ్రీవత్సుడు; రాధికానాథుడు; నగు రాజగోపాలుని సేవించినది. శ్రీని స్తుతించిన అనంతరము గాని నారాయణ స్తోత్రము జరగలేదు. ఇప్పుడు గాని శ్రీమన్నారాయణుడు గాడు. మరల చెంగమలాంబికను స్తుతించుటలో భావమేమియో బోధపడకున్నది. కాని మొదటి పద్యమునందు చెంగమలాంబిక స్తుతిలో 'శాశ్వత లక్ష్ములు' అనుటచే శ్రీదేవిని, మూడవ పద్యములో 'మహిన్'...... ..విజయరాఘవ 'భూవరు' బ్రోచు

గావున - [illegible] చంగమలాంబక యందు భూదేవీత్వమును ఆరోపించినదా యని యూహింపవచ్చును. తరువాత క్రమముగా అనంతుని; గరుడుని; శ్రీనివాసతాతాచార్యులను స్తుతించినది. భగవదనుగ్రహమునకు భాగవతాచార్య కటాక్ష మవసరము కదా! అనంతరము పన్నిద్దరాళ్వారులకు; శంఖచక్రగదా శార్ఙ్గములకు వందన మాచరించినది. ఇట్టి ఇష్టదేవతా ప్రార్థనము తెలుగు సారస్వతమున రాయలయొక్క ఆముక్తమాల్యద యందు గోచరించుచున్నది. ఇంతటి సంప్రదాయ పరిపాలనము రాయలయందుకూడ కానరాదు. ఇష్ట దేవతాస్తుతి తొమ్మిది పద్యములలో సాగినది. ఇవి తెలుగు సారస్వతంలో నవరత్నాలు.

సుకవి స్తుతిని ఈ రంగాజమ్మ ఒక క్రొత్త మలుపు త్రిప్పినది.

కేల్మోగిచెద మృదుసూక్తుల
కమ్మికినై నెమ్మనమునఁ గడఁగెడు భక్తిన్
బమ్మెర సుజనాదృతికన్
వాల్మీకి వ్యాస ముఖ్యవర కవితతికిన్.
[ఆ. 10ప.]

ఇందు వాల్మీకి వ్యాసులను మాత్రమే స్తుతించుటలో ఆంతర్యము. కవిత్వమున కాదిపురుషుడు వాల్మీకి; పురాణేతిహాసములకు వ్యాసుడు అనంతరము వచ్చిన వారందరును వారి అనుయాయులే కదా యని కాబోలు. ఆ తరువాత వేదాంతాచార్యుని తలంచినది ఇటకూడ సంప్రదాయమును వీడలేదు

ఇక కథానాయకుని వంశాభివర్ణన ప్రాచీన కవులవలె సూర్యచంద్రాది వంశవర్ణనతో ప్రారంభము కాక నూతనమార్గమున సాగినది. విరాట్స్వరూపముతో నారంభించినది. ఈ విరాట్స్వరూపమునకు సూర్యచంద్రులు నేత్రములని పురుషసూక్తము చెప్పుచున్నది. నాయకుడగు విజయరాఘవుడు సామాన్యుడు కాడు. సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుని వంశమునకు చెందినవాడు. ఈ విషయమును స్పష్టపరచుటలో రంగాజమ్మ యొక్క భావనా వైభవము పొడగట్టుచున్నది. కాని యీ వంశ వర్ణనయందు కొంత జిగిబిగి ఉన్నది. అది విడదీయరాని సంకెల వంటిది చాతుర్వర్ణ్యము విష్ణుమూర్తి యందుద్భవించిన విషయము లోకవిదితమే. కాని యిట ఒక విచిత్రము కలదు. అది యేమన—

శ్రీలలనా మనోజ్ఞ పద
సీమ సముద్భవమంది ధాత్రిపైఁ
జాలఁ బ్రసిద్ధిఁ గాంచి సర
సంబుగఁ దన్ గొనియాడు వారిఁన్
మేలొన గూర్చుచున్ వెలసి
మిక్కిలిఁ దన్పుచు జీవనంబులన్
నాలవ జాతియొప్పు సుమ
నస్తటినీ సదృశ ప్రచారమై
[1ఆ. 28 ప]

ఈ నాలవజాతి వాచకము శూద్రత్వమును ప్రకటింప చేయుచున్నది. కాని యీ జాతికి ఉద్భవించిన వారు అవనీనాథులైనట్లు రంగాజమ్మ వర్ణించుట మరీ ఆశ్చర్యకరము. అనంతర మీమె చెప్పబోవునది శ్రీకృష్ణుని గురించియే.

ఆ జాతి నుద్భవించిరి
భూజన హితచర్యులార్యపోషణధుర్యుల్
తేజో ధను లతులిత యశు
లాజి ధనంజయు లనేక లవనీనాథుల్.

వ॥ అంత

ఆ వంశంబునఁ గృష్ణ ధ
రావరుఁ డుదయించె నిజకరస్థిత చక్ర
శ్రీవత్స శోభితుండై
తా వెన్నుని రీతి దారితపరాఘుండై.

యాదవులు నాలవజాతి వారు కదా! పై పద్యములు కలనిన కాని యాదవ రాజు కాడు.

అక్కడి నుండి కృష్ణునివంశక్రమము.

కృష్ణునకు - ప్రద్యుమ్నుడు
ప్రద్యుమ్నునకు - అనిరుద్ధుడు
అనిరుద్ధునకు - అచ్యుతుడు
అచ్యుతునకు - రఘునాథుడు
రఘునాథునకు-విజయరాఘవుడు

ఇదీ క్రమము. సాధారణముగా కథానాయకుని వంశవర్ణనము చేసిన వారు వారి వంశవర్ణనమును మాత్రమే చేసి 'నావిష్ణుః పృథ్వీపతిః' అని ఉపమించిరే కాని పరమాత్మ వంశమునకు చెందినవారని నొక్కి వక్కాణించిన వారు అరుదు. విజయరాఘవుడు సాక్షాత్తుగా కృష్ణ పరమాత్మ అంశమే కాదు రంగాజికి సాక్షాత్తు కృష్ణుడే. కృష్ణ పరమాత్మ ద్వాపర యుగము వాడు. విజయరాఘవుడు కలి యుగము వాడు. ద్వాపర కలియుగములకు సంకెల వేసినది. ఇదియేమి చిత్రము! ఇది వేయుకున్న కథ సాగుటెట్లు? పుత్ర సంతానార్థులై కొలిచిన రఘునాథ కళావతీదేవులకు కృష్ణపరమాత్మ విజయరాఘవ నామధేయంబున వెలసి వెయ్యేండ్లు పరిపాలించెద నని వాగ్దానము చేసినాడు. ఈ సంకెలలేనిచో ఆవాగ్దానము ఫలించుటెట్లు? కావున రంగాజమ్మ ఉక్తి వైచిత్ర్యము నంగీకరింప వలసియున్నది.

అట్లయిన ఒక సందేహము పొడమచున్నది. విజయరాఘవుడు 17వ శతాబ్ది వాడు. విజయరాఘవ నామధేయంబున 1000 సం॥లు పాలించిన నిప్పుడు విజయరాఘవుడే దేశమును పాలించుచున్నట్లు? తంజావురమును 1633 నుండి 1674వరకు పాలించి మధుర చొక్కనాథునితో యుద్ధమున మరణించినట్లు చరిత్ర చెప్పుచున్నది కదా! అట్లయిన ఆ విజయరాఘవుడు ఈ విజయరాఘవుడు ఒకరేనా?

'కాంతిమతి విజయరాఘవుని జూచి యతని యందచందముల కాశ్చర్యపడి యతని గుణములను గీర్తించుచు మోహిం

చుట — అను విషయమును చెప్పు తతి రత్నములవంటి కొన్ని పద్యములనుపొందు పఱచినది. ఆ పద్యములందు విజయరాఘవుడు రాజగోపాలస్వామివలె ఆమెకు గోచరించినాడు అందుకల్లనే —

'కావునను రాజగోపాల దేవు డిపుడు
దనర రూపద్వయంబును దాల్చెనేమొ'

అని చెప్పినది. దీనిని నిశితముగా పరికించినచో పైపాడమిన సందేహమున కిది యొక సమాధానము కాగలదు. అది యేమన ఈ విజయ రాఘవుని యందు సాక్షాత్తుగా కృష్ణస్వామును దర్శించగలిగినది రంగాజమ్మ అందుకే యీతని వర్ణనమునందు కృష్ణునియొక్క లక్షణములను పొంది పాసంగించి ది విజయరాఘవుని యందు మక్కువచే అతడు వేయేండ్లు రాజ్యపాలనము చేయవలెనని కోరుకొనిన రంగాజమ్మ స్వప్న వృత్తాంతమును కల్పించియుండును. ఇందలి అత్యుక్తి ప్రశంసావహము.

మరొక చిన్న మనవి. ఇందు పురవర్ణనము ప్రక్కను వారస్త్రీ వర్ణనకలదు. ఇది వెనుకటి మహాకవులు చేసిన రీతిలో సాగిన స్త్రీవర్ణన కాదు. ఈ వారస్త్రీ శబ్దమునకు సాని శబ్దము పర్యాయపదము. ఈ సానులను అప్సరసలనియు; గంధర్వ వంశమున సంభవించిరనియు; శ్రీనాథ మహాకవి చెప్పియున్నాడు అతడట్లు చెప్పుటకు మార్గము చూపినవాడు బాణభట్టు డొకడే కనపడుచున్నాడు. అతడు కాదంబరియందు అప్సరసలములు పదునాలుగు కలవనియు; వానిలో కొందరు సముద్రమథనమున నుద్భవించిన వారును కలరనియు వివరించెను లక్ష్మియు సముద్ర మథనమునందే యుద్భవించినది కదా! అట్లయిన వీరు తోబుట్టువులు కదా! ఈ వారకాంత లాజాతికి చెందియుందురు కావుననే వారి కంతటి సౌందర్య మబ్బినది అంతటి సౌందర్యవతులు కనుకనే రచయిత్రి వీరిని వర్ణించుటలో పూర్వకవుల వలె ముఖమును చంద్రునితోను; పదములను కిసలయములతోను; నేత్రములను కలువరేకులతోను ఇత్యాదిగా పోల్చి వర్ణింపక విశేషరీతిని వర్ణన గావించినది ఈమె వారి వర్ణనలపైవు దృష్టి సారింపలేదు. ఈమె దృష్టియంతయు సాయుధుండగు సాక్షాద్విష్ణువు నందే కేంద్రీకరించినది కనుకనే

అలపురిలోపలం బరగు
నంబురుహాక్షుల యొప్పు మీరు శా
ఖళముల నాభిజంఘలను
కన్బొమలన్ మెఱఁగారు నారులన్
గెలువఁ దలంచి శౌరికిని
నిత్యము సేవనొనర్చుచున్న దౌ
జలజము చక్రమున్ గదయు
శార్ఙ్గము నందకముం దలంపగన్.

ఇట్టి వర్ణనమునకు దారిచూపినవాడు రసికశేఖరుండగు కామరాజ భూషణ కవీంద్రుడు.

ఈ ఉదాహరింపబోవు పద్యము ఆతని ప్రబంధము నందలిదికాదు. ఆతనిరచనయే యగు కావ్యాలంకార సంగ్రహమునందు ధ్వని ప్రభేదములలో ఉదహరింపబడినది.

ఒంటిగా మడికాసు గుంటపైఁగూర్చుండి
సంజకెంజాయ పెంజడలు దాల్చి
సారిది నేకాలంబు సురనదీస్నాతుఁడై
నిద్దంపుబూది మైనిండ నలది
యచ్చగాఁబులితోలు కచ్చకంబు
ఘటించి
యొడలఁ బాములు ప్రాఁకనొప్పుగలిగి
హాలాహలానలాభీల ఘూర్ణము క్రోలి
యఱచేతి హవ్యవాహనముఁ బూని
నీ యశోలక్ష్మిఁ బూను పూనికఁ దపము
సేఁడు నొకరించుచున్నాఁడు నీలగళుఁడు
కానియెడ నేల యతనికీ గతి సెలంగ?
సరస గుణహార! యోబయ నరసధీర!

(ద్వి ఆ; ౧౭౯)

ఇంగు కేవల మద్వైతము కాన వచ్చుచున్నది అంతటి పరమేశ్వరుడు ఈ ఓబయ నరసి హుని యశోలక్ష్మిని పూను పూనికతో తపస్సు చేసినాడు పరమేశ్వరుడే మానవుని కీర్తికై తపమాచరింప ఆయుధములు స్త్రీ సౌందర్యములను గెలువవలయు నని తపమాచరించుటలో ఆశ్చర్యము లేదు. ఇది యొకరకమగు పద్య రచనా చమత్కృతి. ఇట్టి రచన మరియే యితర కవులయందు నా కంతగా గోచరించుట లేదు. కేవల విశిష్టాద్వైతమతానువర్తినియగు రంగాజమ్మ యీ విషయమునందును వైష్ణవ సిద్ధాంతమును వీడలేదు.

ఈ విధముగా ఈ మన్నారుదాస విలాస కావ్యారంభమునందే అనేక విశేషములు గోచరించుచుండ కావ్యము నందింకెన్ని యున్నవో నాయూహకందుట లేదు.

అతులితాష్ట భాషా కవితా సర్వంకష యైన రంగాజమ్మ చిత్రవిచిత్ర సాహిత్య గోష్ఠులందు నిష్ణాతురాలు. రక్తియందు భక్తిని; భక్తియందు రక్తిని పెనవైచి మధుర మంజుల కవితా విపంచిని పలికించిన హృదయవాదిని రంగాజి మధుర సరస్వతీ మూర్తియగు రంగాజమ్మ సంగీత; సాహిత్య; లలితకళా పోషకుడైన విజయ రాఘవ నాయకుని 'శారదా ధ్వజ మందిరము'నకే శారదా ధ్వజము.

— ::: —

# 'ప్రేమ విచికిత్స'

— శ్రీమతి కమలాదేవి

సకల జనుల హృదయాలు సహస్ర, సహస్ర భావసదనాలు. అందులో, ప్రేమకి ప్రముఖస్థానం లభిస్తుంది. ప్రేమ సార్వజనీనమైనది, 'ప్రీణాతీతి ప్రియః' వ్యాకరణ రీత్యా కూడా ప్రేమశబ్దానికి ఆనందబోధకము, హృదయానికి తృప్తికరము అనే అర్థమే ద్యోతకమౌతోంది. 'ప్రీఞ్ ప్రీతౌ' ధాతువునుండి, 'సర్వధాతుభ్యః' అనే ఉణాది సూత్రప్రకారం మనిన్' ప్రత్యయంచేర్చగా ప్రేమశబ్దం ఔతున్నదని విజ్ఞులు వాకొన్నారు. అనంతతృప్తి ప్రదానం చేసేవీ, ప్రీతిప్రదాయకములూ అయిన ఈ ప్రేమభావాలు 'దిక్కాలాత్ అనవచ్ఛిన్న'మైనవే.

ఆదికాలంనుంచీ, మానవులు ఈభావాభివ్యక్తిని చేస్తూనేఉన్నారు. ఈ ప్రేమ అనబడే సాగరంలో శిలకళా విద్యా రూపాలు వయస్సు కలమూ ఇలాంటి వెన్నో కొట్టుకుపోతుంటాయి.

ఈ విషయంలో పలువురు బహువిధాల వక్కాణిస్తారు సారాంశం ఇంచుమించు ఒకటే కావచ్చు. 'కొవ్వంటే లవ్వ!' అనే మూఢవాదానికి పవిత్ర ప్రణయానికి హస్తిమశకాంతరము ఉండనేఉంది. 'విద్వజ్జన పరిశ్రమను విద్వానేవవిజానాతి' అనినట్లు నిర్మలమైన విజ్ఞానమైన ప్రేమతత్వం పశుప్రాయులకి అర్థంకాదు. అది అమృతకళ. అద్భుత వరం అంటారు కొందరు.

ప్రేమ స్వరూపాన్ని గూర్చి నారద భక్తి సూత్రాల్లో 'అనుభవైక గమ్యమే ప్రేమ'అన్నారు. రూపగోస్వామి,'ప్రేమ ఒక సాంద్రభావం. హృదయాన్ని స్నిగ్ధ పరిచేదీ మనోల్లాసదాయకమూ, మమతానుబంధాల మల్లెల మాలిక' అన్నారు. వర్ణ వ్యత్యాసాల్లోనే దీనిక భాషా భేదాలు కూడా లేవు ఒక ఇంగ్లీష్ కవి, 'అహంకార త్యాగం ద్వారా ముక్తిపొందటమే ప్రేమ' అన్నాడు. ప్లేటో 'ప్రేమానుభవ రహితులైన వ్యక్తులు సదా అంధకారంలో ఉన్నట్లు అలమటిస్తారు' అన్నాడు

నీత్సే, 'ప్రేమవల్ల అంతశ్చక్షువులు తెరుచుకుంటాయి, హేవలాక్ 'హీగల్ ప్రకారం ప్రేమద్వారా అభేదస్థితిప్రాప్తిస్తుంది. వాసన ప్రేమ పృథక్కరణ చేస్తూ, ప్రేమ కమలం వాసనారహితం కానిదే వికసించదు. అని సెలవిచ్చారు. ప్రజల్లో 'నిర్మల ప్రేమమనస్కులు దైవ సమానులు' అనే నానుడి ఉంది.

ప్రేమ మనశ్శక్తిని కల్గిస్తుంది. చిత్తదార్ఢ్యం శరీర ఆరోగ్యానికి ప్రాతిపదిక యగుచున్నది.తద్వారా రమ్యదృశ్యాలు జనిస్తాయి. ప్రేమస్వర్గద్వారం అనుకుంటే అందులో ప్రవేశమూ కాని నిష్క్రమణ ఉండదుట మరి. ప్రేమ'యుద్ధం' అనుకుంటే దానికి ఆరంభమే కాని అంతం లేదట ప్రేమకి తెలివీ వాదం అనుభం అఖ్ఖర్లేదు. అదో కిరటం అని కొందరు చెప్తారు.

ప్రేమ అనే గ్లాసులోంచి చూస్తే రాక్షసుడుకూడ దేవునిలాగ కన్పిస్తాడుట; 'పుజిలిష్టు'లకయితే ఏదిచెప్పి మెప్పించలేము గాని, ప్రేమంత సుఖంఏదీ లేదనీ ఎన్నో బాధలు సహించగల స్థైర్యం అలవర్చగల సంజీవని అది అనీ కొందరు విశ్వసిస్తారు.

వినోజ్ఞము రసజ్ఞమూ అయిన శబ్దార్థ సౌందర్య మాధుర్యాలు భాషలో ఏర్పడక ముందునుంచీ, స్వార్థంతోపాటు ప్రేమకూడా ఉందిట. ప్రేమకి పెళ్ళి టార్గెట్ కాదని కొందరూ ఔనని కొందరూ వాదించుకుంటారు. పరిపూర్ణంగా ప్రేమిస్తూ ఆనందించటానికి ఒక జీవితకాలం సరిపోదు అని ఘంటాపథంగా కొందరు వ్రాశచ్చారు. కొన్ని బ్రహ్మకల్పాలైతే కొంత ఫరవా లేదుట!

'అణో రణీయాన్ మహతో మహీయాన్' అనినట్లు రెండు అక్షరాలతో పదించుకున్న ఈభావం మేరువంత గొప్పది

'స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతోభయాత్'అనినట్లు ఈ ప్రేమలో పడ్డమనిషి ఎన్ని కష్టాలైననూ ఎదుర్కొనే మనోబలం సంపాదిస్తాడు.

దేశభక్తులు పూర్వం, భారతమాత మీద ప్రేమతో, పీపులమీద లాఠీలు విరిగినా ఇక్ష్యపెట్టనట్లు, కొందరు కొన్నిటిని విపరీతంగా ప్రేమిస్తారు.

మనలో మృగత్వాన్ని నశింపచేసి, దైవత్వం ప్రసాదించేది నిజమైనప్రేమ అనీ, దాని రూపాంతరమే అనురాగమనీ ఆచంట జానికిరాం గారు, తమ భావన కిలా భావ్యం చెప్పారు. 'ఇవిగో ఇంకా నిద్రలేవని మంచుతడి ఆరని పారిజాతాలు. ఈధవళిమ నా మనోభావాల స్వచ్ఛత ఈఎరుపు నాఅనురాగరక్తిమ ఈపరిమళం నా స్నేహసౌరభం' రససిద్ధాంత సమీకరణ వాదులు, ఒక్కొక్కరు ఒక్కొక్కటి రసమనీ సరసమనీ నిర్వచిస్తారు.

'కరుణో రస మని' భవభూతి 'శృంగారమే' రస మని భోజుడూ, భక్తియని మధుసూదన సరస్వతి, 'మిథ్యామాయా' అని భానుదత్తుడూ ఇంకా చాలామంది చాలారకాలుగా వాదించారు. ప్రేయోరసాన్ని కూడా అందొకటిగా పేర్కొన్నారు.

అలాగే 'దక్షత' అనీ 'కృపా' అనీ ప్రేమకు దశాంతరాలు ఉన్న వంటారు. ఆదోవను వస్తే దాశరథవాణి విన్పిస్తుంది. 'దయాహీన మానవమరుభూమిలోకృపావృష్టి కురిపిస్తాను' అంటూ.

ప్రేమ పెన్నిధి కానియింటను శార్వరీ కళ ఒజ్జలెవ్వరు అని గురజాడ వక్కాణించారు.

ఈ ప్రేమకలాపాల్లో, ఏవైనా మైనర్ మిస్టేక్స్ వాటిల్లినా, 'యౌవనమత్ర అపరాధ్యం న తు చారిత్రం' అని మృచ్ఛకటికలో చారుదత్తుడిలా సమర్థించుకుని సరిపెట్టేసుకున్న సందర్భాలు కోకొల్లలుంటాయి కద.

ఇంకో చిత్రం ఏమనగా, భౌతిక దారిద్ర్యం ఈ అంతరంగిక ప్రేమ గరిమలను ఏమాత్రం అదుపు చెయ్యజాలదు ప్రణయ భావనిధులు విస్తారమైనవి, విమలమైనవి.

స్వచ్ఛమైన నీటికి రుచి, రంగు, రూపము లేనట్లు ఈ ప్రేమకి అంగుష్ఠ మాత్రులనీ, ఆజానుబాహులనీ, నిర్ణయం భేదం లేవు వాగతీతమైనది.

చతురక్షర సంయోగంలాగ నిత్య పల్లవశీలమైనది ఆ ప్రవృత్తి; ప్రేమను గూర్చి విజ్ఞానులు సైతం విశిష్టమైన అభిప్రాయాలు వెల్వరించారు. కమ్మరి తిత్తి లాంటిది ప్రేమలేని శరీరం అని కబీరంటే 'ప్రేమ ప్రతీకారం తలపెట్టదు' అని గాంధీ, మానవ ఆత్మయొక్క అమర సౌందర్య అన్వేషణ ప్రేమ అని సోక్రటీసు నిర్వచించారు.

స్వామి వివేకానంద, 'భయరహితమైనది ప్రేమ. వీథిలో నడిచే అశక్త స్త్రీ కుక్క మొరిగితే భీతితో ప్రక్కయిల్లు దూరుతుంది. కాని ఎప్పుడైనా తన చంకబిడ్డతో వస్తుండగా సింహము ఎదిరించినా బిడ్డను రక్షించుకుంటూ తానే ఎర అవుతుంది. ప్రేమముందు ఏవీ అడ్డురావు. భగవంతుడే ప్రేమ. ప్రేమే దైవం' అని చెప్పగా, రామతీర్థ 'ప్రేమలో ఆధిక్యం, అల్పత్వం లేవు మనలో ప్రేమతత్వం ప్రకాశించినపుడు అత్యంత కఠిన కృత్యమైనా స్వర్గసుఖంగా మారుతుంది' అన్నారు.

ఆంగ్లేయులు, 'ప్రేమించే గుణం ఆరోగ్యదాయకం' అని చెప్తే, మన ఆంధ్రులైన శ్రీ ఉమాపతి పద్మనాభశర్మగారు, 'ప్రేమయొక్క సంతానం విరహం, నింద, ఆత్మహత్య,-' అని చేదునిజం చెప్పారు. గోళ్ళమూడి గోపాలకృష్ణగారు. 'ప్రేమకూడ యుద్ధంలాగ ఆరంభం సులువుకాని ఆపుదల అసాధ్యంసుమా!' అన్నారు.

షేక్స్పియర్ 'డోంట్ ఫియర్' అని ధైర్యం చెప్పి, ప్రేమ కళ్ళతో చూడదు. మనసుతో చూస్తుంది అందుకే లవ్ ఈజ్ బ్లైండ్.' అంతే కాక, దుఃఖాన్ని మధురం చేస్తుంది.' అన్నాడు

ఇంకా అనేక ప్రముఖులు స్నేహానికి ప్రేమ, ప్రేమకు ప్రాణం లేఖ అంటూంటే ఒకొంటెవాడు 'పేదరికం మెట్లెక్కుతూంటే, ప్రేమ కిటికీలోంచి పారిపోతోంది.' అని స్వానుభవమో, లోకానుభవమో తన అభిప్రాయం చెప్పి ఊరుకున్నాడు.

ఇంకో మహాశయుడు ప్రేమ ఆల్జిబ్రా లెక్కలాంటిది. ఎన్ని అడుగులు వేసినా ఈక్వేషనులో రెండువేపులా విలువ సమానమే అన్నాడు

వెనక వేంకటపార్వతీశ్వరకవులు, 'ఈ భవనాశాలూ, కష్టసుఖాలు, ఈ జగతిలో అన్నీ కూడా ప్రేమకొరకే' యని నిష్కర్షించారు.

'కన్నార ప్రియమూర్తి కాంచనీయకే, విరిదండ మెడలో వేసే సిగ్గుకి నేపథ్యం కూడా ప్రేమే' అన్నారు.

'తరాలరాజిల్లే విరులూ, విరుల పరిమళాలూ మురిపెములూ, వగైరాలన్నీ ప్రేమకోసమే అని వారు నిర్ధారించారు.

రాయప్రోలువారు, స్త్రీ పురుషుల ఆకర్షణ విధిగా లైంగికానుభవం గానే పరిణమించే కర్మ అవసరంలేదు హృదయగతమైన ప్రేమ ఈ క్షణికానుభవము కన్న మిన్న అని చక్కగా సమ్యక్ దృష్టితో ప్రతిపాదించారు

ఆయన తన తృణకంకణంతో 'కనుల నొండొరులను చూచుకొనుట కన్న, మనసు లన్యోన్య రంజనల్ గొనుట కన్న, కొసరి ఏవేవో భాషించుకొనుట కన్న, ప్రేమ సాఫల్యం వేరేదీ లేదని వ్రాసారు. ప్రేమలో భిన్నచ్ఛాయలున్నాయని వివరించారు వారు.

దాంపత్య భక్తియేకాక మాతృవాత్సల్య రక్తి సఖ్యాసక్తి ఇవన్నీ ప్రేమ యోగాలే. ప్రేమే ముక్తి. తపోధ్యాన, దాక్షిణ్యాదులతో తాల్మితో, లీనమై నిల్చియుండేది ప్రేమ అనినారు.

'పవిత్ర ప్రేమకు వివాహాదివ్యవస్థలు అడ్డుకావనీ, అంతరంగాన్ని కలపగల్గినది ప్రణయమనీ ఆ ఆరాధనలో సంయోగ వియోగాలు సమానమనీ కూడా ఆయన ఉద్దేశం.

ఎంకిని కూసింతసేపు కూకుండనీకుండా, గుండె గొంతులో కొట్లాడేలా చేసి దికూడా ప్రేమే.

ప్రణయకవన సౌధాలకి మేస్త్రీ లాంటి కృష్ణశాస్త్రి గారి రచనలు ప్రేమోరస ప్రేరకాలు, పరిమళాలకోరకాలు.

కాంతం, కిన్నెర, శశికళ,- శకుంతల, ఇత్యాది నవీన సనాతన నాయికలెల్లరూ కూడా ప్రేమగంగలో జలకాలాడిపూతలయిన వాళ్ళేకదా!

సన్మిత్ర సాంగత్యం చందనమూ, చందమామలకన్న సంతోషదాయకం అని అనుభవజ్ఞులు చెప్తారు.

'అనురాగం అంబరమై ఆనందం అర్ణవమైతే ప్రపంచాన్ని పరిహసిస్తాం' అన్నారు శ్రీ శ్రీ.

'ప్రేమించు ప్రేమకై ప్రేమించు ముక్తికై - వలపెరుగక బ్రతికే న్యూనత కంటె వలచి విఫలమైనా విలపించమేలు' అని బసవరాజు అప్పారావుగారు అన్నారు.

# మాదిరెడ్డివారి "వంశాంకురం" లో "పుత్రప్రాశస్త్యం"

## కొడుకుపుట్టాలని కోరుకుంటా రెందుకు ?

— శ్రీమతి ఎం సావిత్రి, ఎం ఏ ,బి యిడి.

సామాన్యంగా మనుష్యుల మనుగడ, వారి ఆదుర్దాలు చూస్తే చాలా ఆశ్చర్యం వేస్తుంది. బిడ్డ పుట్టినది లగాయితు తల్లి తండ్రులకు ఆందోళనమే. వారికి వయస్సుకు తగ్గ విద్యలు వస్తున్నాయా లేదా? పిల్లవానికి మాటలొస్తా యా రావా? మాట లొచ్చాక నడక, నడకొస్తే .. అక్షరాభ్యాసం, చదువు, ఆపైని ఉద్యోగం–పెళ్ళి–పేరంటం. తర్వాత ఇంకేముంది. తిరిగి సంతానం కనటం ఇదీ ప్రపంచపు కాలచక్రం.

ఈ ప్రత్యుత్పత్తి సైకిల్ లో కూడ తల్లితండ్రులు తమకు కొడుకు పుట్టాలనే కోరుకుంటారు కొడుకు పుట్టాడనగానే కొండంత సంబరంతో విందులు వినోదాలు చేస్తూ సంతోషపడతారు. కూతురు పుట్టిందనగానే మూతి విరుస్తుంది–చుట్టు ప్రక్కల అమ్మలక్కలసమాజం అంతెందుకు ? కన్నతల్లే అయ్యో! ఆడపిల్లా? అని అంటూ 'నేనెంత దురదృష్టవంతురాలిని' అని వాపోతుంది. తనజాతిని తానే హీన పరచుకుంటున్నాననికూడా బాధపడదు ఆతల్లి.

ఇది మన భారతదేశ సంప్రదాయమేమో, మనువు సృష్టించిన మనుశాస్త్రవిధానమో, వేదోపనిషత్తుల ప్రభావమో తెలియదు. ఇది ఎప్పటినుండి ప్రజలలో పేరొక్కొని పోయిందో చెప్పటం చాలా కష్టం. కాని ఈ విషయాన్ని తర్కించి చూస్తే దీనికి కారణం ఒకటి కావచ్చు.

'పుత్రుడు' అంటే పున్నామ నరకం నుండి రక్షించే వాడని అర్థము. 'పుం' అనేది నరకాలలో ఒకటి. పితరులకు శ్రాద్ధాది కర్మలచేత విముక్తి కలిగించి ఈ నరక ప్రాప్తి కాకుండా రక్షించేవాడు గావున 'పుత్రుడు' అని పేరు వచ్చింది. కొడుకుని తనూజుడు–ఆత్మజుడు అనికూడా అంటారు.

'అంగాదంగాత్ సంభవసి
హృదయాదధి జాయసే
ఆత్మా వై పుత్రనామాసి
త్వం జీవ శరదాం శతమ్॥

అంటే ఈ శ్లోక సారాంశమును బట్టిఅంగ అంగముల నుండి పుట్టిన వాడు గావున తనూజుడనియు, తన ఆత్మవంటి ఆత్మయై పుత్రుని నామము పొందనాడు గావున ఆత్మజుడని అర్థము తెలుస్తోంది. అయితే హైందవ సంప్రదాయమును బట్టి కొడుకు కోసం ఎందుకింత తపన పడతారో కొంచెం అర్థం లేకపోలేదు. అపర కర్మలను చేయుటకు పుత్రుడే అర్హుడు. ఆడు బిడ్డకు కర్మాధికారము లేదని, వేదపఠనార్హత లేదని, వేద కర్మాచరణ లేదని ఘోషిస్తున్నాయి వేదాలు ఇంతెందుకు? ఆఖరికి తులసి దళములను కోయుటకు కూడా స్త్రీలు అనర్హు లేనట.

'అపుత్రస్య గతిర్నాస్తి'

సుతులు లేనివారికి గతులు లేవు అంటే తరించడానికి పితరులకు శ్రాద్ధాదికర్మ లుండవు, కనుక వారికి నరకము ప్రాప్తి స్తుందని దీని భావము.

'ప్రజయా హి మనుష్యః పూర్ణః'

అసలు పురుషుడు పుట్టగానే పాతిక భాగంతో పుడతాడు. వివాహం అవడంతో సగభాగంగా పరిగణింపబడతాడు. బిడ్డ పుడితే ముప్పాతిక భాగం పూర్తి అయినట్లు, కొడుకు పుట్టగానే పురుషుడు నూటికి నూరుపాళ్ళు పూర్తి అయి పూర్ణ పురుషుడుగా లెక్కింపబడతాడు. ఇంతేకాక–

'ఇమాం కన్యాం సదక్షిణాకం సతాంబూలం చ తుభ్య మహం సంప్రదదే'...

అని చదివి, కొబ్బరి బొండం, తాంబూలం, గంధపు చెక్కతో సహా నీళ్ళు వదలుతూ కన్యచేతులను, వరుని చేతులలోకి అప్పగిస్తారు కన్యాదాతలు పరులకు మనమేదైనా వస్తువును దానమిచ్చినచో ఆ వస్తువుపై మన అధికారము పోయినట్లేగదా ! అటులనే కన్యాదానమును.కాబట్టి కన్యకు కన్నవారింటి పేరుపోయి, పెండ్లియాడిన వరుని ఇంటిపేరును ధరించవలసి వస్తుంది. పర్యవసానమేమిటంటే కూతురు పుట్టినచో వంశనామముపోతుంది.కొడుకు పుట్టినచో వంశ నామము నిలుస్తుంది. అందుకే కొంతమంది అసంస్కారంగా దెబ్బలాడుకున్నపుడు, దాయాదుల ఆస్తి

---

( ఏ వ పేజీ తరువాయి )

జానపదుల భాషలో నండూరివారు ఎంకితో ఎన్నో ప్రేమగీతాలు రమణీయంగా స్మరణీయంగా ఆలాపించారు.

అప్రాప్త మనోహరిలో అబ్బూరివారు హృద్యమైన పద్యాల్లో ప్రేమాంజలి ఘటించారు మరియు 'పరమప్రేమ స్వరూపములై లోకాలపావనము చేయు, ప్రణయకవులే మీకు పరులెన్నవా రెవ్వరే కోకిలా!' అని పరభృతాల నుద్దేశించి ఉగ్గడించారు. ప్రేమరహితజీవనం నిర్గంధకంటక మిద' అన్నారు ప్రబంధకవులు. బృహదారణ్యకంలో, పరమాత్మను కూడా ప్రేమగా ప్రియునివలె ఉపాసించు దని ఉంది 'ఆత్మాన మేవ ప్రియ ముపాసీత!'

ఎన్నెన్నో గొప్పయుద్ధాలకు చరిత్రలకూ ప్రేమ కారణమైంది – ఎందరి సమాధులకో హేతువయింది – మరెన్నో గాథలకు పునాది అయింది.

— 0 —

కలహాలల్లోనూ 'నీ వంశం నిర్వంశం గానూ!' అని తిట్టుకోవటం మనం వింటూంటాము.

ఇంత మహాత్మ్యం పుత్రునకుండబట్టే తమకు కొడుకు పుట్టాలని, కులదీపకుడు, వంశాంకురం కలగాలని ఆశించడం జరుగుతోంది.

ఇంత గంభీరభావం గల విషయాన్ని కేంద్రంగా తీసుకొని శ్రీమతి మాదిరెడ్డి సులోచనగారు 'వంశాంకురం' నవలను రచించారు. తమ వంశం నిలవటానికి మనుమడి కోసం సరస్వతమ్మ, రంగారావులు పడిన వేదన అత్తమామలకు వంశాంకురాన్ని ఇవ్వలేకపోయానని అరుణ పడిన వేదన మానసిక క్షోభ, తనకాలు జారిన ప్రవర్తనకు సురేఖవల్ల తనకు పుట్టినకొడుకుని కొడుకుగా చెప్పుకోలేక ఆనందు పడిన వేదన పడుమదనపు దుడుకులో తొందరపడి పెళ్ళి కాకముందే మాతృమూర్తి అయి కొడుకుని కన్న సురేఖ కష్టాలు, కన్నతండ్రి కప్పచెప్పి తన సర్వాన్ని వదులుకొని తపస్వినిలాగ ఆశ్రమ సేవకు వెళ్ళిపోయిన సురేఖ త్యాగం ఈ నవలలో చక్కగా పొందుపరచబడ్డాయి. ఇక్కడ కథాభాగాన్ని కొంచెం వివరించడం అనుచితం కాదు

రంగారావు సరస్వతమ్మలు అనుకూల దంపతులు సహృదయులు. బాగా కలిగిన వారు వారికి లేక లేక కలిగిన ఏకైక సంతానం 'ఆనందు'. బాల్యంలో తండ్రి స్థితిగతులు అతనిమీద ఏవిధమైన అనుచిత ముద్ర వేయలేదు. కాలేజీ చదువుల్లోకి వచ్చాక స్నేహితుల ప్రభావంవల్ల కళాశాల రాజకీయాలలోను ఎలక్షన్లలోను పాల్గొనడంవల్ల చదువు కుంటుపడింది. ఒకసారి కాలేజీ వార్షికోత్సవములలో సీతారామయ్య అనే సంగీత విద్వాంసుని చేత పాటకచేరి పెట్టిస్తాడు ఆనందు. ధనార్జన లేక, విద్యని పోషించేవారెవరూ లేక, జీవితం గడపటం దుర్లభంగా తెలుస్తూ బాధపడుతున్న సీతారామయ్యగార్ని స్వల్ప పారితోషికంతో సత్కరించడంతో అతని కుమార్తె సురేఖతో పరిచయమవుతుంది ఆనందుకి.

అయినాసరే జీవితాన్ని అక్కడ గడపలేక ఉదరపోషణకై తన కూతురు సురేఖతో మద్రాసు చేరుకుంటాడు సీతారామయ్య. సురేఖ చదువుకుంటున్న విద్యార్థులకు పదిమందికి అన్నం వండి పెడుతూ, తిగులుమిగలు పదార్థాలతో తమ ఇద్దరిపొట్టని పోషించుకుంటూ కాలక్షేపం చేస్తూవుంటుంది.

పరీక్షల్లో ఫేలయి ఉన్నత విద్యలకు అర్హత కోల్పోయిన ఆనందుని ప్రింటింగు డిప్లమో కోర్సులో మద్రాసులో చేర్చారు తండ్రి రంగారావుగారు.

ఆనందు శరీర ప్రకృతికి హాస్టలు భోజనం సరిపడలేదు పూటకూళ్ళింట భోజనం కొంతనయమని తన మిత్రుల సలహాతో పూటకూళ్ళింట భోజనానికి కుదురుతాడు. అనుకోకుండా వారితో అక్కడ ద్వితీయ పరిచయం కలుగుతుంది.

రాను రాను వారి జీవిత సమస్యల్లో బాధ్యత పంచుకుంటాడు. అతనిది సహజంగా జాలిగుండె. అందులోనూ సీతారామయ్య; సురేఖలు చాలా ఉత్తములు. వారు పడుతున్న ఆర్థిక కష్టాలను చూడలేకపోయాడు. సీతారామయ్యగారు జబ్బునపడ్డాడు. 'ఆడపిల్లను ఓ ఇంటిదాన్ని చేయలేకపోయాను. అనాథను చేసిపోతున్నా' నని బాధపడుతూ. ఆనందు చేతిలో ఒప్పచెప్పి కన్ను మూసేడు. ఆనందు అనాథ అయిన సురేఖను ఆదరించాడు. ఇద్దరూ సన్నిహితులయ్యారు. సురేఖ కాలుజారింది, గర్భవతి అయింది.

పరీక్షలయి, సెలవులకు ఇంటికెళ్ళేడు ఆనందు. తల్లిదండ్రుల ఒత్తిడికి బానిస అయ్యాడు. డబ్బు వ్యామోహంలో పడ్డాడు. లక్ష కట్నం తెస్తున్న అరుణను కాదనకుండా పెళ్ళిచేసుకున్నాడు. అరుణ అందాలరాశి. అపరంజిబొమ్మ. ఆమెకు అన్ని హంగులూ ఉన్నా ఆరోగ్యం లేదు. కడుపులో నొప్పి. రోగగ్రస్త అయింది. వైద్యం చేయించారు. ఆపరేషన్ అయింది. కడుపునొప్పి తగ్గింది కాని శాశ్వతంగా సంతానాన్ని పొందే అర్హత కోల్పోయింది. ఇంట్లో సౌఖ్యంలేదు. ఎంతైనా తాను పురుషుడు. ఒక నిండు ప్రాణికి చచ్చిపోయేటప్పుడు తాను వాగ్దానము చేసి మోసము చేసినందుకే దేవుడు తనకు అన్యాయం చేసేడని బాధపడతాడు ఆనందు.

పురుష సహజ మనోదౌర్బల్యం చేత అనారోగ్యవతి అయిన అరుణతో తాను పొందలేకపోతున్న సుఖాన్ని బజారులో కొనుక్కొని పొందాలని వెడతాడు. ఒక మంచి వేశ్యదగ్గరికి చేర్చబడతాడు. ఆ వేశ్య ఎవరో కాదు. తన సురేఖయే.

సురేఖ గర్భవతి అయి, సమాజం చేత తిరస్కరింపబడి, దిక్కులేక. ఒక వేశ్య చేత ఆదరింపబడి అక్కడే ప్రసవిస్తుంది. బిడ్డను పెంచుకోవటానికి అనేక విధాల కష్టాలుపడుతుంది. సంఘంచేత ఎన్నో ఎదురుదెబ్బలు తింటుంది. జీవితాన్ని గడపటానికి తాను వేశ్య అవక తప్పలేదు. ఇదీ! సంఘంలో స్త్రీస్థానం పిల్లవానితో బ్రతుకు గడపాలి మాతృత్వము ఆమెలో ఆశను పెంచింది చచ్చిపోదామనుకున్నా చావలేకపోయింది పిల్లవాడిపేరు 'నందు' చాలా చురుకు. అన్నింటినీ సూక్ష్మంగా గ్రహించేశక్తి. తన ప్రవర్తన పిల్లవాని లేత మనస్సుపై అనుచిత ముద్రవేస్తుందని భయపడి పిల్లవానిని బోర్డింగులో చేర్పించింది. తాను పొట్టకూటికై పడుపువృత్తిలోకి దిగుతుంది. ఈసందర్భంలోనే ఆనందు ఊర్వశి అని పేరు మార్చుకున్న వేశ్య సురేఖని కలుస్తాడు.

చాలరోజుల క్రితం విడిపోయిన ఇద్దరు ఈ రీత్యా తిరిగి కలుసుకుంటారు. కష్టసుఖాలు మాట్లాడుకుంటారు. తన జీవిత

సాఫల్యం వంశాంకురాన్నిచ్చి తానుగా ఆశ్రమ సేవకు వెళ్ళదల్చుకున్న తన మనోభావాన్ని వ్యక్తం చేస్తుంది సురేఖ. సమాజంలో తల్లిలేని పిల్లవాడుగా జీవితం నప్పుతుంది కాని తండ్రి ఎవరో తెలియని జీవితం నప్పదు. అట్టి పిల్లవానిని సమాజం ఆదరించదు.

తనకు ఒక కొడుకు పుట్టాడని సంతోషించాడు ఆనందు. సురేఖ అనుమతితో తన కారులో కూర్చోబెట్టుకుని ఇంటికి తీసుకెళ్ళేడు. 'నందు' మీద ఆనందుకెంతో ప్రేమ. అరుణ కూడా చాలా విశాల హృదయంతో కన్నతల్లిలాగ 'నందు'ని పెంచుకొంది 'ఆయన్ని నేను సంతోష పెట్టలేకపోయినా ఆయన కిష్టమైన నందుని సరిగ్గా పెంచడంద్వారా ఆయనకి కనీస సంతోషం చేకూర్చవచ్చుగదా!' అనేది అరుణ పోలసీ ఆనందుకి తాను ఇల్లాలుగా ఎల్లాగూ సర్వసౌఖ్యాలు అందజేయలేకపోతోంది. ఆనందుకు ఇష్టమూ ప్రాణంతో సమానమూ అయిన నందుని ప్రేమతో చూసుకుంటూ ఆనందు ఆదరాభిమానాలు పొందటం కంటె అరుణకు కావలసిన దేముంది?

కాని కులగోత్రాలు తెలియని నందుని పెంచుకోవటం విషయంలో సరస్వతమ్మగారు రాజీకి రాలేదు. రంగారావు పుట్టుక్కి ఆ ఐదేండ్ల బాలునిలో ఆనందు చిన్ననాటి రూపాన్ని చూడగలిగాడు. ఆయన మురిసిపోయేవాడు. మాటలతో 'తాతగారూ' అని సరసలు కలిపి అందర్నీ మురిపిస్తున్నాడు 'నందు'. ఆనందు-సరస్వతమ్మలమధ్య పట్టింపులొచ్చాయి 'నందు' తన కొడుకే అని చెప్పే ధైర్యం ఆనందుకి లేదు. ఆ ధైర్యం లేకే గతంలో సురేఖకి అన్యాయం చేశాడు నోటితో చెప్పలేక ఆఖరికి చీటిద్వారా తెలిపి వెళ్ళిపోయాడు. సరస్వతమ్మ కడుపులో గల అనుమానం తొలగిపోయింది.

సురేఖపై సరస్వతమ్మకి ఎంతో జాలి కలిగింది. సాటి స్త్రీ అమృత భాండంవంటి జీవితం [illegible] బాధ పడింది. అందరు సేవాసదనానికి వెడుతున్న సురేఖని చూడడానికి వెళ్ళేరు. 'నీ సంతోషాన్ని సర్వాన్ని మాదగ్గర వదలిపోతున్నావు. ప్రతిగా మేము నీకు ఏం ఇవ్వగలము.' అంది బాధగా సరస్వతమ్మ. నిర్ణయం మార్చుకొని తనతో రమ్మంది. అరుణ వీరందరు బయటకు వెళ్ళిన కారణాన్ని గమనించగలిగింది. తలగడ క్రింద నున్న ఉత్తరంద్వారా అన్నీ తెలుసుకుంది. ఆయాసపడుతూ స్టేషన్‌కి చేరుకుంది. తన ఇంటిదీపం నిలిపిన మహనీయురాలిని చూచి ఇంటికి రమ్మని వేడుకుంది. కాని రేఖరాలేదు 'ఇక బాబు నీవాడని అప్పగిస్తూండగనే రైలు కదిలింది అందరూ రేఖ త్యాగానికి జాలిపడ్డారు. ఇంటికి వచ్చారు. అందరి విచారాన్ని హరింపచి మురిపిస్తున్నాడు 'నందు'— ఆ ఇంటి 'వంశాంకురం'.

అయితే ఇందులోని ప్రధానపాత్రలు మూడు మహత్తరంగా చిత్రింపబడ్డాయి. 1. అరుణ 2. సురేఖ 3. ఆనందు.

సంతానవతి. త్యాగశీల అవటంచేత సురేఖ స్థానమే ఎక్కువదని చెప్పవచ్చు 'మీలాంటి వారి నీడను బ్రతికే అర్హత కోల్పోయే'నని వయస్సుపొంగులో తాను చేసిన పొరపాటుకు జీవితమంతా ఏడుస్తుంది సురేఖ. ఆనందుని భర్తగా పొందలేకపోయినందులకు వాపోతుంది. అవివాహితగా తాను తల్లి అయినందుకు బాధపడుతుంది తాను ఏమైనాసరే తన కుమారుని పెద్దవాడిని చేయాలని సంకల్పించింది. వాడిని పెంచి పెద్ద చేయటానికి గత్యంతరము లేక ధనార్జనకి వేశ్యావృత్తిని స్వీకరించింది చివరికి ఆనందుని కలుసుకోగలిగినందుకు సంతోషపడుతుంది పిల్లవాడు అనాథుడు కాకుండా కావలసిన వారిదగ్గర జేర్చగలిగినందుకు పరవశించిపోతుంది. 'మీ ధనం మీకు జేరడమే నాకు కావలసింది, నేనాసించినది అయింది. మీ దగ్గర మీనీడలోనికొచ్చే హక్కును నేను కోల్పోయే'నని పిల్లవానిని అప్పగించి కన్నకొడుకును త్యాగము చేసిన ఉత్తమురాలు.

ఈ పాత్ర సజీవపాత్ర. ఇల్లా పడుచుతనంలో యౌవనపుపొంగులో కాలుజారటం, గర్భవతి అవటం, సంతానం కలగటం, ఆ యువకునికోసం వెతకటం, వాడు దొరకకపోవటం సమాజం అవహేళన చేయుటం— మన నిత్యకృత్యంలో ఎన్నో చూస్తున్నాం. కుంతీకుమారివంటి వారు పౌరాణిక కాలంలోనూ ఉన్నారు. నేడూ ఉన్నారు. ఇటువంటి పొరపాట్లవల్ల కలిగేనష్టం అటుంచి ఆ విషయాన్ని పసిగట్టినసమాజం నాడు స్త్రీని అగౌరవపరచింది నేడూ అగౌరవ పరుస్తూనే ఉంది ఇది సమాజంలో మార్పును తేలేదు మనిషి తన సంకుచిత తత్వాన్ని వీడలేదు. అసలు స్త్రీకి స్త్రీయే శత్రువు స్త్రీ తన తోటి స్త్రీ పట్ల సానుభూతి చూపగల్గితే సమస్యలు సగం పరిష్కారమవుతాయి. భర్త సంపాదనను హాయిగా కూర్చొని అనుభవిస్తూ, ఆయింటి ముచ్చట్లు, ఈ ఇంటి ముచ్చట్లు ఉబుసుపోక చెప్పుకునే ఆడవారు సంఘానికి చీడపురుగులు.

ఇటువంటి సర్వసాధారణమైన విషయాన్ని మామూలు జీవితాలకు సన్నిహితంగా ఉండే కథని ఎంచుకోవటంలో శ్రీ సులోచనగారి లోచనాలు నిజంగా సులోచనాలే!

సామాన్యంగా మానవనైజ మేమిటంటే పిల్లలు లేకపోతే పిల్లలు కావాలనిపిస్తుంది. అందులోను ఐశ్వర్యంఉండి పిల్లలు పుట్టకపోతే అది మరింత అదుర్దాకి హేతువౌతుంది. వారికే కాదు. వారి బంధువర్గానికి కూడా అదుర్దాయే. ఎందుకంటే పెంపకానికి మనవాడి నిద్దాం అంటే మనవాడి నిద్దాం అనే భావం బంధువు లందరిలోను కలుగుతుంది ఆ ఆస్తిని ఎప్పుడు ఎట్లా కాజేయాలా అని

గోతికాసిన నక్కలా కూచుంటారు బంధువర్గం. ఇవన్నీ అతిసహజమైన విషయాలు. ఇటువంటి మానసిక ప్రవృత్తులను చిత్రించటాన ఈనవల మానవజీవితానికి ఎంతో సన్నిహితంగానూ, స్వాభావికంగానూ ఉంది.

అత్తకట్నం తీసుకువచ్చిన అరుణలో అతిసామాన్యమైన ప్రవర్తన, సౌమ్యమైన ప్రవర్తన, ఆపాదింపబడింది. అత్తమామలపై భక్తిప్రపత్తులు, భర్తపై అనురాగమూ, నందుపట్ల ప్రేమ, అరుణలో నిండుతనాన్నిచ్చాయి.

ఆనందు తానను కొన్న విధంగా సురేఖతో జీవితం గడపలేకపోయాడు. సామాన్యంగా మగవారు తాముచేసిన తప్పులకై నాసరే - ఇంట్లో ఆడవాళ్ళమీద విరుచుకు పడతారు. కాని ఆనందు అల్లా కాదు. 'ఒక తండ్రిని నమ్మించి మోసపుచ్చినందుకు ఆ పాపాన్ని నేను అనుభవిస్తున్నాను' అంటాడు.

'అరుణ ఎందుకు అనటం నాన్న? ఎవరూ ఎవర్నీ మోసం చేయలేదు. మన దురాశ మనన్ని మోసంచేసింది.' అని అంటాడు అరుణ రోగిష్ఠిదని తాను ఎన్నడు వినుక్లోలేదు. ఉదాత్తస్వభావం గలపాత్ర.

ఇద్దరు భార్యలతో కుటుంబాలు నడపవు ఎంత ఆదర్శమూర్తులైనా పురుషుడు ఇద్దరు భార్యలను మెప్పించలేడు. అందుకనే కవయిత్రి రేఖను సేవాసదనుకి పంపివేశారు.

రేఖ చేసిన త్యాగంవల్ల ఆమె జీవితం ఒక కన్నీటి కెరటాలవెన్నెల. ఆ వెన్నెలను కన్నవారి కిచ్చి తాను నిశీథంలోకి నిష్క్రమించింది. రెండేళ్ళ వ్యక్తికి అన్నం వండిపెడుతూ సన్నిహితురాలై ఆనందు ఎడ్రసు వగైరాలు తెలుసుకోక పోవటం- తగినవిషయాల ఆచోకీ తెలియకుండగానే ఆనందుతో అక్రమ సంబంధం పెట్టుకోవడం. కొంచెం పాత్రపట్ల అనుచితంగా ఉంది.

మాదిరెడ్డి సులోచనగారు రచించిన కథలు దేనికదే ఒక వెరైటీ.

అమృతకలశంలో (రాజీవ్) కొడుకువల్ల కలిగిన తాపం - వంశాంకురంలో కొడుకు పుట్టనందువల్ల కలిగిన తాపం రెంటికి రెండే స్పెషల్ వెరైటీ. అందుకనే ఇవి తెలుగు కుటుంబాల చరిత్ర కథారిటీ అనటంలో అతిశయోక్తి లేదు



## ద్వంద్వం

శ్రీ ఉమ్మిటి విఘ్నేశ్వరరావు.



దేవుడెవడో నాకు తెలియనే తెలియదు
ఈ ప్రపంచమునకు నీశ్వరునకు
మధ్య బాంధవాది మార్మిక విషయాల
జోలి కేను పోను చాల దవ్వు.

నేను చేయుపనులు నిర్విఘ్నముగకొన
సాగి, సత్ఫలిత మొసంగి, ఏవి
ధమగు బాధలపడక మెలగు నప్పుడు
నాస్తికత్వబుద్ధి నడతు నేను.

రోగగ్రస్తుడనై నా
మైగర్వోద్ధతి నశించి మంచమె గతియై
పోగా; నాపను లేగై
కోగా నసమర్థుడనయి కొలుతు
హరిహరున్.



## త్రిదశులు

డా. శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావు
ఎం. ఏ., పి. హెచ్. డి

ఒక ప్రక్క —

మేడలూ, మిద్దెలూ,
భవనాలూ, రాజప్రాసాదాలూ
నక్షత్రాల వజ్రాలు తాపిన
ఆకాశకిరీటాలు ధరిస్తున్నాయి
ఆశలనందనవనాలు నాటిస్తున్నాయి
అష్టవిధభోగాల తూగుటుయ్యాలలో
నిద్రిస్తున్నాయి
'అయిదుచుక్కల' స్వర్గసీమల
దివ్యాప్సరసల కౌగిళ్ళల్లో
పరవశిస్తున్నాయి..

మరొక ప్రక్క —

డాబాలూ, పెంకుటిళ్లూ
రేకుల షెడ్లూ, తాటాకిళ్లూ
డాబుగా దర్పంగా భయంభయంగా
పైనిపటారం లోనలొటారంగా
బ్రతుకులు ఈడుస్తున్నాయి
త్రిశంకు స్వర్గంలో విహరిస్తున్నాయి
నీతినియమాల్ని తు. చ. తప్పకుండా
పాటిస్తున్నాయి
సమాజస్వరూపాన్ని భద్రంగా
పరిరక్షిస్తున్నాయి..

ఇంకొక ప్రక్క —

పూరిగుడిసెలూ, పేవుమెంట్లూ
చెట్లనీడలూ, మురికి వాడలూ
ఆకలి తుపానుల్లో నవనాడులూ
క్రుంగిపోయి
భోరున ఏడుస్తున్నాయి
పాతాళాంధ తమస్సుల్లో మునిగి
అఘోరిస్తున్నాయి
జీవితాన్ని దుర్భరశాపంగా
భరిస్తున్నాయి ... ... ...



# ఆంధ్రములో అష్టాదశ వర్ణనముల నిర్ణయము

— శ్రీమతి వి. నాగరాజ్యలక్ష్మి, ఎం. ఏ.

'వర్ణ వర్ణనే'. 'వర్ణ' ధాతువునకు 'వర్ణించుట' అని అర్థము. కవి యనగా వర్ణించువాడని భావము. వర్ణనా నిపుణుడైన కవిచేతినుండి వెలువడినది కావ్యము. అది సర్వలక్షణ సమ్మిశ్రితము. అందు వర్ణనములు ఒక ప్రధానాంశము. వర్ణనములు కథాగతికత్వం తోపస్కారకములు. కవియొక్క మనోభావముల విశదీకరింపబడుట కివి సాధనములు. మఱియు కవియొక్క ప్రతిభా వైభవము, బుద్ధి వైశారద్యము, పాండితీ గరిమయు వర్ణనములలోనే ప్రస్ఫుటము లగును. ఇతిహాస పురాణాదులలో న్యాయధర్మ ప్రతిపాదనము, ముక్తకాదులలో చమత్కారము, దృశ్యకావ్యములలో రసపరిపోషణము ప్రధానములైన విధముగ శ్రవ్య ప్రబంధములలో వర్ణనములు ప్రధానములైనవి.

ఆలంకారికులలో వర్ణనముల విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. సంస్కృతమున 'దండి' మున్నగు నాలంకారికులును తెలుఁగున చిన్నకోట పెద్దన మొదలైన లాక్షణికులేకాక నన్నెచోడ కవియును వర్ణనములను గూర్చి ప్రస్తావించియుండెను. వారివారి యభిప్రాయములను బట్టి ఆంధ్ర సాహిత్యములోని అష్టాదశ వర్ణనము లెవ్వియను సంశయమును నిర్ణయింపవలసియున్నది. ప్రథమముగ సంస్కృతాలంకారికుల వాక్కులను పరిశీలింతము,

దండ్యాచార్యుడు [5వ శతాబ్ది] కావ్యములో నుండదగిన వర్ణనముల నిట్లుగ్గడించెను.

నగరార్ణవ శైలర్తు
  చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యానసలిల క్రీడా
  మధుపానరతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ
  కుమారోదయ వర్ణనైః
మంత్ర ద్యూత ప్రయాణాజి
  నాయకాభ్యుదయైరపి
ఏతాని యత్ర వర్ణ్యంతే
తన్మహాకావ్య ముచ్యతే
ఏషా మష్టాదశానాం యైః
కశ్చిదూన మపీష్యతే.
  -కావ్యాదర్శము, ప్ర.ప.16,17,18.

1. నగరము. 2. అర్ణవము, 3. శైలము 4. ఋతువు, 5. చంద్రోదయము, 6. సూర్యోదయము, 7. ఉద్యానవనము, 8. సలిలక్రీడ, 9. మధుపానము, 10. రతోత్సవము, 11. విప్రలంభము, 12. వివాహము, 13. కుమారోదయము, 14. మంత్రము, 15. ద్యూతము, 16. ప్రయాణము 17. ఆజి, 18. నాయకాభ్యుదయము అను పదునెనిమిది వర్ణనములుగ అది మహాకావ్య మనబడును. వీనిలో కొన్ని లోపించు వచ్చును. అని పై శ్లోకముల తాత్పర్యము అనంతరము కేశవమిశ్రుడు కావ్యమున ముప్పదిరెండు వర్ణనము లుండవలె నని వచించెను.

'వర్ణ్యశ్చ రాజా దేవీ చ
  దేశో గ్రామః పురీ సరిత్
సరోఽబ్ధ్య రణ్యోద్యానాద్రి
  ప్రయాణ రణ వాజినః
హస్త్యర్క చంద్రా వృతవో
  వివాహోఽథ స్వయంవరః
సురాపుష్పాంబు సంభోగః
  విశ్లేష మృగయాశ్రమాః
కలా ఋతుర్వయస్సంధీ
  ధాతువృత్త్యభి సారికాః'
  -అలంకార శేఖరము, షోడశమరీచి.

ఇందు కథితములైన వర్ణనము లివి. 1. రాజు, 2. దేవి. 3. దేశము, 4. గ్రామము, 5. పురి, 6. సరిత్తు, 7. సరస్సు; 8. అబ్ధి 9. అరణ్యము, 10. ఉద్యానవనము 11. అద్రి, 12. ప్రయాణము. 13. రణము, 14. వాజులు, 15. హస్తి, 16. సూర్యుడు, 17. చంద్రుడు, 18. వివాహము, 19. స్వయంవరము, 20. సురలు, 21. పుష్పములు, 22. అంబువు, 23. సంభోగము, 32. విశ్లేషము, 25. మృగయ, 26. ఆశ్రమము, 27. కల, 28. ఋతువు, 29. వయస్సంధి 30. ధాతువు, 31. వృత్తములు, 32. అభిసారికలు.

మఱియు నేయే వర్ణనముల నేయే యంశము లుండవలె నను విషయమును కూడ నాతడు వివరించియుండెను. దండ్యాచార్యునికంటె నధికముగ నీతడు పదునాలుగు వర్ణనములను నుడివెను.

తదుపరి విశ్వనాథ కవిరాజు ఇరువదినాల్గింటిని గా వర్ణనములను గణించెను.

'సంధ్యా సూర్యేందు రజనీ
  ప్రదోష ధ్వాంత వాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయా
  శైల ర్తు వనసాగరాః
సంభోగ విప్రలంభౌ చ
  మునిస్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమ
  మంత్రపుత్రోదయాదయః
వర్ణనీయా యథాయోగం
సాంగోపాంగా అమీ ఇహ
కవే ర్వృత్తస్య వా నామ్నా
నాయక స్యేతరస్య వా
  -సాహిత్య దర్పణము,
  ష.ప, 322,323,324

1. సంధ్య, 2. సూర్యుడు, 3. ఇందుడు 4. రజని, 5. ప్రదోషము, 6. ధ్వాంత వాసరము 7. ప్రాతఃకాలము, 8. మధ్యాహ్నము 9. మృగయ, 10. శైలము, 11. ఋతువు, 12. వనము, 13. సాగరము,

14 సంభోగము, 15. విప్రలంభము, 16 ముని, 17. స్వర్గము, 18. పురము, 19. అధ్వరము, 20 రణము, 21. ప్రయాణము, 22 వివాహము, 23 మంత్రము, 24 పుత్రోదయము అను వర్ణనములు యథాయోగముగ కావ్యములో నుండవలెనని యతని యభిప్రాయము. ఆపై 'సాంగోపాంగా ఇతి జలకేళి మధుపానాదయః' అనియు నుగ్గడించెను.

ఈ ముప్పురు వివరించిన వర్ణనములలో సామ్యములున్నా మొత్తముమీద ఏకాభిప్రాయము కుదురలేదు. ఇక ఆంధ్రాలంకారికులు చెప్పిన యంశములను పరికింపవలెను. ఆలంకారికుడు కాకున్నను నన్నెచోడుడు కావ్య లక్షణములను చెప్పుచు నందు వర్ణనముల నిట్లు గణించెను.

'వన జలకేళీ రవి శశి
తనయోదయ మంత్రగతిరత క్షితిప రణాంబునిధి మధు ఋతు పురోద్వా
హానగ విరహదూత్య వర్ణనాష్టాదశముల్'
—కుమారసంభవము ప్ర.అ-41.

దీనినిబట్టి 1. వనము, 2. జలకేళి, 3 రవి, 4. శశి, 5 తనయోదయము, 6 మంత్రము, 7. గతి, 8 రతి, 9 రాజు, 10. రణము, 11. అంబునిధి, 12 మధుపానము, 13. ఋతువు, 14. పురము, 15. ఉద్వాహము, 16. నగము, 17. విరహము. 18 దూత్యము అను విధముగ వర్ణనములు పదునెనిమిది యని తెలియుచున్నది. ఈ పదునెనిమిదియును దండ్యాచార్యుడు చెప్పిన వర్ణనములతో సరిపోలుచున్నవి.

విన్నకోట పెద్దనయును (1410ప్రాంతము) ఆవర్ణనల విషయము నిట్లు పేర్కొనెను.

'పుర వారాశి మహీధరర్తు శశభృ
త్సూర్యోదయోద్యాన పుష్కరకేళీ మధుపాన మోహాన వియో
గ క్షేమయాన స్వయం
వరపుత్రోత్సవ మంత్ర దూత్యరణ దోర్దీప్రక్రాంతి సంకీర్తనా
కరమష్టాదశ వర్ణనాన్వితము త
త్కావ్యంబు భవ్యం బిలన్.'
—కావ్యాలంకారచూడామణి ప్ర.ఉ.9ప.

1. పురము, 2. వారాశి, 3. మహీధరము, 4. ఋతువు, 5 శశభృత్తు, 6. సూర్యోదయము, 7. ఉద్యానవనము, 8. పుష్కరకేళి, 9. మధుపానము, 10 మోహనము, 11. వియోగము, 12. క్షేమయానము, 13 స్వయంవరము, 14 పుత్రోత్సవము, 15 మంత్రము, 16 దూత్యము, 17. రణము, 18. దోర్వీర్యవర్ణన అను వానితో కూడిన కావ్యము భవ్యము అని పైపద్య సారాంశము. ఇతని పరిగణనములో నించుక భేదమున్నది. నన్నెచోడుడు క్షితిప, ఉద్వాహ అనువర్ణనములను వచింపగా నీతడు స్వయంవర-దోర్దీప్రక్రాంతి సంకీర్తన మని యుగ్గడించెను. మిగిలిన వర్ణనములు తుల్యములు. ఆపై భట్టుమూర్తి వాని నిట్లు పేర్కొనెను

'పుర సింధు నగర్త్విన శశి
సరసీవన మధు రతి ప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయ నయ
విరచన యాత్రాజి దౌత్య విభువర్ణనముల్'
—కావ్యాలంకార సంగ్రహము,
ద్వి ఆ 166 ప.

1 పురము, 2. సింధువు, 3 నగము, 4. ఋతువు, 5 ఇన, 6 శశి, 7 సరసి, 8. వనము, 9 మధువు, 10 రతిప్రసంగము, 11 విరహము, 12. పరిణయము, 13. తనయోదయము, 14. నయవిరచనము, 15. యాత్ర, 16. ఆజి, 17 దౌత్యము, 18 విభుడు-అను వర్ణనములిందు క్రమములు. నన్నెచోడుడు చెప్పిన జలకేళి, మంత్రము అను వర్ణనముల నీతడు తడవక సరస్సు, నయవిరచనము అను వానిని పేర్కొనెను. నీతిని వర్ణించుట అనుదానికంటె మంత్ర వర్ణనమే సమంజసముగ నున్నది సరస్సు, జలకేళి అను నవి సమీపస్థము లనవచ్చును. ఈముప్పురి యభిప్రాయములలో సామ్యములు కానవచ్చుచున్నవి

అప్పకవిఅష్టాదశసంఖ్యను హెచ్చించి ఇరువది రెండు వర్ణనములను వచించెను.

'పురమును ఋతుషట్క-
మును ప్రయాణంబును
శైలంబు వేటయు సాగరంబు
మునీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుత రణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
వనవిహారంబులు వారికేళి
కన్యాంగ సౌందర్యకథనంబు హిమకరా
ర్కోదయంబు విప్రలంభోదితంబు
పద్మ మిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదమ్మును సుతజననము
ననగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయు ప్రబంధంబు శ్రీనివాస.
—అప్పకవీయము, ప్ర ఆ 28 ప.

భట్టుమూర్తి చెప్పిన 'నయవిరచన' మను దానిని తొలగించి వేట, ఆశ్రమము, విజయము, కన్యాంగ సౌందర్యకథనము, దౌహృదము అను వాని నధికముగా నుగ్గడించెను.

ఈపై భిన్నాభిప్రాయములనుబట్టి ఆంధ్రములోని అష్టాదశ వర్ణనము లెవ్వియో తేల్చవలయును విన్నకోట పెద్దన, నన్నెచోడుడు, భట్టుమూర్తి ముప్పురును వర్ణనములను పదునెనిమిదిగనే వచించియుండిరి పెద్దన చెప్పిన 'దోర్దీప్రక్రాంతి సంకీర్తన'మను దానికంటె నన్నెచోడుడు చెప్పిన 'క్షితిప' వర్ణనము గణనీయము. అట్లే భట్టుమూర్తి చెప్పిన 'నయవిరచనము' అను వర్ణనమున కన్నను నన్నెచోడుడు వచించిన మంత్రవర్ణనము సమంజసముగా నున్నది. దండ్యాచార్యుడు

చెప్పిన వర్ణనములును నన్నెచోడు డుగ్గ్రసించిన వర్ణనములును ఏకరీతి నున్నవి. కావున మొత్తముమీద ఆంధ్ర సాహిత్యములోని పదునెనిమిది వర్ణనము లివి.

1. నగరము, 2. నగము, 3. ఉద్యానవనము, 4. జలకేళి, 5. సూర్యోదయము, 6. చంద్రోదయము, 7. తనయోదయము. 8. మంత్రము, 9. ప్రయాణము. 10. రతి ప్రసంగము, 11. రాజవర్ణనము, 12. రణము, 13. అంబునిధి, 14 మధుపానము 15. ఋతువు, 16 ఉద్వాహము, 17 విరహము, 18 దూత్యము.

ఆంధ్ర సాహిత్యములో అష్టాదశ సంఖ్యకు ఒక ప్రత్యేక స్థానము కలదు. పురాణములు పదునెనిమిది కలవు. వానికి గల ఉపపురాణములు పదునెనిమిది కలవు. ఆంధ్ర సాహిత్యమున కాద్య గ్రంథమగు మహాభారతమున పర్వములు పదునెనిమిది. అందలి కురుక్షేత్రయుద్ధము పదునెనిమిది దినములు సాగినది. ఆ సంగ్రామమున పదునెనిమిది అక్షౌహిణుల సైన్య ముపయోగింపబడినది. ఆ ప్రాముఖ్యమునుబట్టి వర్ణనములు కూడ పదునెనిమిదిగా వర్గీకృతములైనవి. ఈ అష్టాదశ వర్ణనములును కావ్యములో నవశ్యము నుండవలెనను నియమము లేదు. ఔచిత్యమును బట్టియు సందర్భ శుద్ధిని బట్టియు మితముగ వర్ణనములు చేయుటయే వర్ణనా శిల్పము. మహాకవులగు కాళిదాసాదులు తమ శ్రవ్యములలో ఈ వర్ణనములను యథోచితముగ గావించుచు కథాసూత్రమునకు విచ్ఛేద మేర్పడకుండునట్లు జాగరూకతతో నిర్వహించి 'వర్ణనా నిపుణః కవిః' అను నానుడికి పాత్రులైరి

—...—

# అరకులోయ సౌందర్యానుభూతి

శ్రీ వసంతరావు రామకృష్ణారావు, ఎం.ఏ.



* ఉన్నత పర్వతంబుపయి
  నూర్ధ్వముఖంబుగ పోవువాహనం
బెన్నియొ వక్రమార్గముల
  నేగుచునుండగ, నేను భావ సం
పన్నత నందినాఁడను వి
  భావము చెందిన మానసంబునం
గ్లిన్నత మాసిపోయినది
  లీలగ దోచెను లోయ చూడగన్!

♦ ఉదయ మగుటయు, నధిక సమ్ముదముతోడ
నరకునందలి సహజ సోయగము గాంచి,
పరవశించితి! కడు మనోహరములైన
దృశ్యములు భావుకులకు ప్రీతిని ఘటించె!

* నాదగు నాప్తమిత్రమును
  నాతని శ్రీమతి, వారి పుత్త్రుడున్,
మోద మెలర్ప నాయెడల
  పూజ్యత, నెయ్యము కల్గియుంట, ప్రే
మాదర భావబంధురము
  నైకలసిల్లు ప్రయాణ మేర్పడన్
బాదరబంది వీడితిని
  భాగ్యవశంబున లోయ జూచితిన్!

* భావపరంపరల్ కలుగు
  వారల జీవిత మెల్లవేళలన్
శ్రీకలసిల్లి, సంతసము
  చేకుఱ చేయును గాన, మానవుం
డేవిధి చూచినన్, ప్రకృతి
  దృశ్యములన్ గని, మోదమందుచున్
జీవితమందు, సంతసము
  నిత్యము పొందగ నేను కోరుదున్!

*ఇదియేటి వృక్షమొ యేపుగా పెరిగెను;
  ఆకులేలేని, యీ ద్రుమాకవింత!
ఇదియేమిభూజమో! యింపులు కురియించి
  గుబురుగా పెరిగిన, క్రొత్త చెలువు!

# శ్రావణపూర్ణిమ

శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ, ఎం.ఏ.



ఇది సమస్త ప్రజాహృదయావృతాంధకా
  రవిభంజన శ్రీ విరాజితంబు
ఇది పవిత్ర ప్రభాస్పద సూత్నయజ్ఞోప
  వీత ధారణ కార్యవిలసితంబు!
ఇది దేశరక్షణాభ్యుదయ దీక్షా కంక
  ణైకధారణ సమభ్యంచితంబు!
ఇది పరస్పరశుభప్రద సమున్నత సుహృత్
  భావాబ్ధితట సేతుబంధనంబు!
ఇది అమరభారతీదేవి మృదుల పాద
మంజు మంజీర కలనాద మహితలలిత
లాస్యదివ్యోత్సవ కళావిలాస కలిత
మిదియె 'శ్రావణ పూర్ణిమా'
  మృతమహంబు! ॥

—...—

---

ఇది యెంత పొలిచె! పూపొదయంచు,
  మదినెంచి,
  పూలత గాంచిన పులకరింత!
ఇదియేటి పాదపంబిటువంటి దానిని,
  కనియుండలేదను, కలవరింత!

*అరకు సౌందర్యమును జూచి, పరవశించు
భాగ్యమబ్బెను నేటికి! ప్రకృతియెంత
ముచ్చటను గొల్పె! వింతగు పచ్చగడ్డి
తివ్నెలవియును, నానంద దీప్తినొసగె!

*మాన్యమిత్త్రుడతండు- నిర్మలుడు- ఘనుడు
ప్రొద్దుటూరు నివాసి! సంపూర్ణభావ
విలసితుడు! సుబ్బరాయుడు! వేడ్కమీర
నన్ను కొనివచ్చె నిటకు! మన్ననలతోడ!

—...—

# వేదయుగమున భక్తి

— శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, ఎం.ఏ. (లిట్)

మానవ హృదయాంతరాళమున గల భగవద్విషయికమైన అనురాగమే భక్తి. ఇట్టి అనురాగము అనాదిగా మానవునిలో గలదు. మానవుడు చైతన్యవంతుడై ఈ విశాల విశ్వమున పశుపక్ష్యాదుల కన్న భిన్నమైన తన ఉనికిని గుర్తింపనారంభించిన నాడే ఆతనిలో రాగద్వేషాదు లంకురించినవి. ఆనాడే భక్తి భావమును ఆవిర్భవించినది.

అనాది మానవుడు తన భావ ప్రకటనమునకై భాషను సాధనము గావించుకొనినాడు. నాగరక జీవనము పెంపొంది, మానవ జీవితము క్రమ పరిణామ వికసితమగు కొలదిని భాషతోపాటు కవిత్వము (విస్తృతార్థమున రచనా వ్యాసంగము) సైతము మానవునకు భావప్రకటనసాధనమైనది.

భారతీయులకు వేదరాశియే తొట్టతొలుత వెలసిన సాహిత్య మనవలసియున్నది. వేదములతో పాటు వేదముల కడపటి భాగమైన ఉపనిషద్విజ్ఞానమేర్పడినది. క్రమముగా పురాణములు, కావ్యజాలము ప్రక్రియా వైవిధ్యముతో అలరారుచు బహుముఖీనమై కన్పట్టుచున్న నేటి అనంతమైన సాహిత్యము ఏర్పడినది. ఈ సంఘమున సాహిత్యము పొందిన ప్రతి పరిణత దశయు మానవుని మానసిక వికాసమునకు లేదా పరిణామమునకు ప్రతీక. భక్తిభావముపట్ల మానవ మనస్తత్త్వము వేదకాలము నుండియు క్రమ పరిణతి నొందినది.

భారతీయ సాహిత్యమున ఆద్యగ్రంథము శ్రీమద్రామాయణము. లౌకిక వాఙ్మయము రామాయణముతో ప్రారంభమైనదని, వైదిక వాఙ్మయము రామాయణమునకు పూర్వమే గలదని, వేదములు అపౌరుషేయములని, వేదఋక్కుల ప్రభావము వాల్మీకిపై, వాల్మీకి ప్రభావము తరువాతి కవులపై గలదని మన మెఱిగినదే. అందులకే భారతీయ సాహిత్యమున ఆధ్యాత్మిక భావనకు విశేషప్రాముఖ్యము కన్పట్టును.

భక్తిభావము వేదకాలము నాడే ప్రారంభమై, ఉపనిషత్తులయందు పరిణతి నొంది, పురాణకాలము నాటికొక పరినిష్ఠితమైన రూపమున వెల్లడియైనది. భక్తి భావనకు సంబంధించిన అంశములు వేదములందు బహుళముగ కన్పట్టును.

శబ్దరూపమును పొందినజ్ఞానమే వేదము. వేదములు శ్రుతులు. అపౌరుషేయములు, అనాది సిద్ధములు. 'విద్' ధాతువునుండి 'వేదము' అను పదము పుట్టినది. దేవునికి పూర్ణత్వము నొసగూర్చునది వేదము.

'భజ్' ధాతువు ఋగ్వేదమున కలదు. 'ఆరాధించు', 'సేవించు' అని ఈ ధాతువున కర్థములు. వేద సంహితలయందు 'భక్తి' యను పదమునకు మారుగా 'ఉపాస్' పదము కన్పట్టును. భక్తికే 'ఉపాసనా' అని నామాంతరము గలదు. నేటికిని 'సగుణోపాసన', 'నిర్గుణోపాసన' అని 'భక్తి'కి పర్యాయ వాచకముగా 'ఉపాసన' పదము కన్పట్టుచున్నది. 'యస్య విశ్వ ఉపాసతే' అని యజుర్వేద (సంహిత)మున గల ప్రమాణము. తొలినాళ్ళలో 'భక్తి'కి మారుగా 'ఉపాసనా' పదమే ప్రయుక్తమయ్యెడిది.

కాని, నేటికాలమున క్షుద్ర దేవతల యెడ గల పూజ్యభావము కూడ 'ఉపాసన' అనియే వ్యవహరింపబడుచున్నది. అనగా 'భక్తి' యను నర్థమే చెప్పవలసి వచ్చును. కాని క్షుద్రదేవతోపాసనము స్వార్థసంకలితము. పరమభక్తిలో స్వార్థమునకు తావు లేదు. తమ ఇష్ట దైవతముల పట్ల మానవునకు సహజముగ నుండు (సగుణ) భక్తియు తొలిదశలో సవ్యాజముగనే యుండవచ్చును. ఐనను, అది క్రమ పరిణతి నొంది, అభ్యాసవశమున నిర్వ్యాజమైన 'పరమప్రేమ' రూపమై, అమృతత్వమును సిద్ధించుకొనును. 'యజన్తే సాత్త్వికా దేవాన్' అనికదా! భగవద్గీత. సత్త్వగుణ ప్రధానమైన భక్తుని హృదయములో దేవునిపట్ల గల సగుణ భక్తి భావమెంతో ఉత్తమోత్తమమైనది. అది నిర్గుణోపాసనకు దారిచూపును. భక్తునిహృదయము నిర్గుణభక్తిలో సంపూర్ణమైన దైవీసంపత్తుతో విరాజిల్లును. నిర్గుణ స్థితికి జేరిన పరాభక్తిలో స్వార్థమునకు లేశమాత్రమైన తావులేదు.

కాని క్షుద్ర దేవతోపాసనమునం దిట్టి క్రమపరిణతికి అవకాశమే లేదు. అచటి సాధన స్వార్థప్రశమనమునకు సహకరిం

పదు. అట్టి ఉపాసన మాద్యంతము స్వార్థముతో కూడియుండును. స్వార్థబుద్ధితో ప్రారంభమై, స్వార్థ సంపాదనమునకై వృద్ధిచెంది, స్వార్థసిద్ధియే లక్ష్యముగా కొనసాగుచుండును. కావున క్షుద్ర దేవతల విషయమున లోక వ్యవహారమునగల 'ఉపాసనా' శబ్దమునకు కేవలము 'ప్రయత్నము' అను నర్థమునుమాత్రమే చెప్పవలసి యుండును.

భక్తికిసంబంధించి ప్రధానమైన ప్రాథమిక విషయములను ఋగ్వేద 'వరుణ సూక్తము' తెలియజేయును.

వేదములందు 'ప్రణీతి' అను పదము కూడ కన్పట్టుచున్నది. ఇదియును 'భక్తి'కి సమానార్థకముగనే కలదు. 'యస్య తే స్వాదు సఖ్యం, స్వాద్వీ ప్రణీతిః॥'– 'ప్రభూ! నీ స్నేహము మధురము. ఆహ్లాదకము. ఆనందకరము. నీపట్లగల 'ప్రణీతి' సమస్త దుఃఖ నివారకము. పరమానంద దాయకము. 'ప్రణీతి' అనగా ప్రణయము. సర్వాంతర్యామితో ప్రణయానుబంధమే శాశ్వతమైన ఆనందము నొసగూర్చునని వేదఋషులు ఆత్మానుభవ పూర్వకముగా పలికిరి. ఇచ్చటి 'ప్రణీతి' సర్వాంతర్యామి పట్ల గావున నిది 'భక్తి'కి పర్యాయ వాచకమని గ్రహింప వలసి యున్నది. 'ప్రణీతి' అనగా 'అనన్య భక్తి' అని నైఘంటుకార్థము.

'శ్రద్ధ'యే భక్తి యని, వేదములందు భక్తికి మారుగా 'శ్రద్ధా' పదము ప్రయుక్తమైనదని కొందఱి తలంపు.

వేదములందు 'శ్రద్ధయా సత్యమాప్యతే' 'శ్రద్ధే శ్రద్ధాపయేహనః' అని శ్రద్ధను గూర్చి చెప్పబడినది. 'శ్రద్ధాదేవీ! మా హృదయము లందుండి మమ్ము శ్రద్ధాళువులను గావింపుము.' అనుటను బట్టి 'శ్రద్ధ' సాధనమగుచున్నది. ఇది భక్తి సాధనము సత్సాంగత్య. మనోనిగ్రహాదులతోపాటు శ్రద్ధయు ఋగ్వేదమున భక్తి సాధనముగా పేర్కొనబడినది. సత్సాంగత్యము, అద్రోహము, శ్రద్ధ, దానము, ఉదార స్వభావము, సంయమము, అరిషడ్వర్గ జయములు భక్తి సాధనములుగా చెప్పబడినవి. శ్రద్ధా, విశ్వాసములద్వారా సత్య స్వరూపుడగు పరమాత్మను చేరవచ్చునని వేదములందు గలదు.

భక్తి జ్ఞాన సాధకమని మన విశ్వాసము. ఆచార్య శ్రీ శంకరులవారు 'భక్త్యా జ్ఞానమ్ ప్రజాయతే' యనికదా! సిద్ధాంతీకరించినారు. శ్రద్ధయు జ్ఞానసాధకమే. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అను గీతా వాక్యమునుబట్టి పర్యాలోచించిచూడగా 'శ్రద్ధ' యను పదము 'భక్తి'యను పదమునకు పర్యాయ పదముగా తోచును.

వేదములు భక్తి భావ విశిష్టతను ప్రతిపాదించినవి.

నిర్గుణుడు, నిరాకారుడు నగు సర్వాంతర్యామి పట్ల గుణశ్రవణ మాత్రముననే తరగలెత్తు భక్తి భావము నిర్గుణ భక్తి. జాహ్నవ్యాది నదులు సాగరమున సంలీనమగుటకు వేగిరపడునట్లు భక్తుని హృదయము భగవదైక్యమునకై యారాటపడును. ఇట్టి నిర్గుణ భక్తి భావమునే భాగవతము కూడ పేర్కొనుచున్నది.

'మద్గుణ శ్రుతిమాత్రేణ
మయి సర్వ గుణాశ్రయే।
మనోగతి రవిచ్ఛిన్నా
యథా గంగాంభసోఽంబుధౌ॥
లక్షణం భక్తియోగస్య
నిర్గుణస్య హ్యుదాహృతమ్।
అహైతుక్య వ్యవహితా
యాభక్తిః పురుషోత్తమమ్॥'

భక్తుని మనోవృత్తులన్నియు భగవానుని దెసకే ప్రసరించి, అనంత దివ్యగుణాకరుడైన ఆ సర్వేశ్వరుని యందు లీనమగును. అట్టి భక్తుని ఆత్మ సాకార, సారూప్య, సామీప్య, సాయుజ్యముల నొందునని మోక్షశాస్త్రవిదు లభిభాషించుచున్నారు.

'అగ్నిం విశ్వా అభిపృక్షః సచన్తే,
సముద్రం న స్రవతః సప్తయహ్వీః॥'

అను ఋగ్వేద మంత్రమునకు భాగవత భక్తి సన్నిహితముగా కన్పట్టుచున్నది.

ఆదిమ కాలమున మానవులు వ్యవసాయమే ముఖ్యవృత్తిగా జీవించెడి వారు కదా! తొలినాళ్ళలో భక్తిభావము మానవుల నిత్య వ్యవహారములపై నాధారపడి ప్రారంభమై యుండును. తనశక్తికంటె అతీతమై, అనూహ్యమైన ప్రకృతిశక్తిని మానవుడారాధింప మొదలిడినాడు. దిక్పాలకుల కధిపతియని ఇంద్రుని ప్రార్థించినాడు. సకాలమున వర్షములు కురియునట్లొనర్పుమని వరుణదేవునకు మ్రొక్కినాడు. ఇట్లే వాయువు, అగ్ని మున్నగు దేవతలు కూడ మానవుని ఆరాధనకు లక్ష్యములైరి. తమ ప్రార్థనల నాలకించి, తమకు సాయపడుచున్న దేవతను మాన

వులు సఖునిగా, సోదరునిగా, తల్లిగా, తండ్రిగా భావింప మొదలిడిరి.

వేదకాలమున తొలుత ఇంద్రుడే దైవము. ఇంద్రుని తల్లిగా, తండ్రిగా పేర్కొనినారు. ఇంద్రునిపట్ల (అనగా దైవముపట్ల) గల భక్తి భావము తండ్రి పట్ల తనయునికిగల భావముగా వ్యక్తమైనది. ఋగ్వేద సూక్తములలో ఇంద్రుని "సోదరా!" యని సంబోధించుటయు కలదు. ఇట్టిప్రీతి ఇంద్రునికే పరిమితమై యుండలేదు. తాము ఆరాధించు దైవము లందఱ పట్లను ప్రసరించినది. "అదితియే తల్లి, తండ్రి, తనయుడు"— ఇట్టివేయగు పెక్కునిదర్శనములు వేదకాలము నాటి భక్తిని తెలియచేయును.

ఇట్లు భగవంతుని భిన్నరూపములుగా ఆత్మీయత ననుభవించుట భక్తిలో నొక దశ.

క్రమముగా తనుక రక్షకుడు భగవంతుడే అను భావము మానవ హృదయములలో బలపడినది.

"త్వం త్రాతా తరణే! చేత్యో భూః,
పితా మాతా సదమిన్మానుషాణాం!"

"నీవే ఈ ప్రాణికోటికి సదా తల్లివి, తండ్రివి, సంసార బాధా నివారకుడవు" అని ఋగ్వేదము. భగవంతుని సమస్త భువనాధీశ్వరత్వ సంభావనముకూడ వేద కాలము నుండిమే కన్పట్టును."పతిర్బభూథాఽసమో జనానా మేకోవిశ్వస్య భువనస్య రాజా !" అని ఋగ్వేదము. (సంహిత)

"భగవంతుడైన ఇంద్రుడు మనకు కళ్యాణ కారకుడైన సఖు" డని వేదము, "స న ఇద్రః శివః సఖా" — 'అగ్నిదేవుని తండ్రిగా, సోదరునిగా స్నేహితునిగా నేను భావించు చున్నాను అని వేదఋషులు పల్కిరి." అగ్నిమన్యే పితర మగ్నిమాపి మగ్నిం భ్రాతరం సద మిత్సఖాయం,"

భక్తిలో అద్వైత భావనా సంసిద్ధియు వేదకాలమునాటికే ఛాయామాత్రముగ రూపు దిద్దుకొన్నది. "నీవే నేను" అని కానన్నను "నీవు మావాడవు— మేము నీ వారలము" అనునంతటి సాన్నిహిత్యము పాదులు వేసికొన్నది. "త్వమస్మాకం—తవస్మసి" అని ఋగ్వేదము పేర్కొనుచున్నది.

ఇంద్ర, అగ్ని, రుద్ర, అదితి, వరుణుల నెవ్వరిని పేర్కొన్నను ఏకత్వభావనమే వేదకాలమున, విశేషించి ఋగ్వేదకాలమున రాజ్యము చేసినది. వేదములు అగ్ని, ఇంద్ర, వరుణ రుద్రాద్యనేక నామములతో వర్ణించినది ఒకే పరమాత్మను అని మాత్రము మనము గుర్తించంగ వలసియున్నది.

"ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు
రథో దివ్యః ససుపర్ణో గరుత్మాన్ ।
ఏకం సద్విప్రా బహుధా వద న్త్యగ్నిం
యమం మాతరిశ్వాన మాహుః॥

తత్త్వదర్శనులైన మేధావులు ఒకే పరమాత్మను ఇంద్ర, మిత్ర, వరుణ, అగ్ని మున్నగు వివిధనామములతో వ్యవహరించుచున్నారను సంశమును మఱువరాదు.

మానవాళికి భగవంతుడే ప్రియతముడు, రక్షకుడు, ఇంత మాత్రమేకాదు. ఇట్లు పరిణతినొందిన మానవ హృదయములో క్రమముగా "భగవంతుడు మోక్షప్రదాత" యను భావ మేర్పడినది.

వేదకాలమునాడు భగవంతునిపై గల నమ్మకము భక్తిభావమునే చాటును. అనంతుడైన ఆ సర్వాంతర్యామి జీవునికిసుఖ శాంతుల నిచ్చును. జగత్సృష్టి, స్థితి, లయ కారకుడైన ఆభగవంతుడే భక్తులకు భవ భయ బాధా నివారకుడు.

"ఓం శం నో అజ ఏకపాత్ దేవో అస్తు
శంనోఽ హిర్బుధ్న్యః శం సముద్రః
శంనో అపాం నపాత్ పేరు రస్తు
శం నః పృశ్ని ర్భవతు దేవ,గోపా॥"

అట్టివిశ్వాసముతో లౌకిక పారలౌకిక సుఖములను,మోక్షసుఖమును ప్రసాదించు భగవానునకు వేదఋషులు నమస్కరించిరి.

సకలసుఖములకు నెలవైన పారమార్థిక సుఖమునొసగు భగవానుని, మంగళమూర్తి యగు సర్వేశ్వరుని జూచినద్రష్టలు వారు. వారి ప్రార్థన :

"ఓం నమః శంభవేచ మయోభవేచ॥
నమః శంకరాయ చ మయస్కరాయచ।
నమః శివాయ చ శివతరాయచ॥"

లౌకిక, పారలౌకిక సుఖములకు భగవానుడే అధీశ్వరుడన్న భావము వేదకా

( తరువాయి 17 వ పేజీలో )

# రామకృష్ణుని కవితా వైభవము

— శ్రీ కే. కిశోరబాబు

పఠితలకు మనోల్లాసము గలిగించు భుజా భోజనము సంతరించిన రసవతివంటి కావ్యము తెనాలి రామకృష్ణుని పౌండరీక మాహాత్మ్యము (పాండురంగ మాహాత్మ్యము). ఆంధ్ర సాహిత్యమున వెలసిన క్షేత్ర మాహాత్మ్య కావ్యములందది హిమాలయోత్తుంగ శృంగము. కర్బురవర్ణ విన్యాసములు గల మరుత్స్థలము. అడుగులకు మడుగు లొత్తించుకొను రూపాజీవ వలెనది నిరంతరము సాహిత్య ప్రియుల చేత నివాళిక లందించుకొనుచుండెడి (ప్రౌఢ) ప్రబంధరాజము. పసిగా పుపయసాకెలను మోహపరచి పులకింపజేయగల కాంబరీ గోపాలునివలె మనలను దిగ్భ్రమపరచి పులకింపజేయగల సుందరకావ్యమది. ఏతత్కర్త రామకృష్ణుడు. కవిజన సహకారావళీ వసంతోత్సవ సూక్తి నిధియని, ఉభయభాషలందున దిట్టయని, నలందరగుల నెన్నగల కావ్యధారల ఘనుడని, ఆశువునందు గరము మేటియని, శైవ వైష్ణవ పురాణావళి నానార్థ రచనా పటిమైక రమ్యమతి యని, సరసార్థ బోధ ఘటనా హేలాపరిష్కార శారదరూపమని, కృతిపతి విరూరి వేదాద్రి మంత్రి సింహముచేత పొగడ్తలందుకున్న ఉత్కోచుడు. మరి యటువంటి విరవరి కూరిన కావ్యము పద్మకర్ణికనుగొలువున్న పద్మవోలె నవీన సుషమా ప్రభలను విరజిమ్ముచు రంజింపజేయకుండునా?

స్కాంద పురాణ నీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీనందను సత్కథోద్యమము నవ్యకవిత్వ కళాకలాపమున్ గుందనమున్ ఘటించి కడు గ్రొత్తగు సొమ్మొనరించి శరత్కాదంబినీ చంద్రికా చిద్రూపాంచిత యగు తెలుగు భారతి గళహారమందలంకరించిన వికలకలాదుడు తెనాలి రామకృష్ణుడు. కావ్యమందలి పంచాశ్వాసములను వీణాముని నిక్వాణమువలె మధుర మధురముగ మలచుట యందతడు గనబరచిన ప్రజ్ఞ యత్యద్భుతము. ఎంతటి కఠిన పద్యమునైనను గొనబుం బ్రాయపు తేజీ కూనవలె తీర్చిదిద్దగల నైపుణ్య మతనికి కొట్టినపిండి. ప్రథమాశ్వాసము నందలి శీతాహార్య సుతాళిని వికచ రాజీవంబు, (29) పద్మినీ పద్మాశ పత్రంబు శిథిల పత్రాగ్రమై రాయంచ యాశ్రయించె (136) గంగాసంగమ మిచ్చగించునె మదిన్ గావేరి దేవేరిగా (139) కావు కావనుట రక్కసుల మూక నెకాని నవిచె నీయెడ సింహనాద విహృతి (145) బలుపాపతల చుట్టు అలవరించినవారు లేత చందురుల దాలిచిన వారు (165) పద్మరాగ మణీమయపాదలబ్ధి (175) వెడదకన్నులవాని వెయినామములవాని (213) మున్నగు పద్యములు మిరుమిట్లు గొలుపు కోహినూరు వజ్ర ఖండములవంటివి.

నిగమ శర్మోపాఖ్యానమున నతని కవితా ప్రతిభ పరాంకోటి కెక్కినది. ఆ కథాభాగము కోణార్క, హళేబీడు, రామప్ప దేవాలయముల వంటిది. అటువంటి మహాద్భుత సృష్టిని నిర్మించుట ఒక రామకృష్ణుని గంటమునకే సాధ్యము. అందలి పద్యములు అమృతము గూడు కట్టుకున్న రసాలములవలె మంపుగొలిపి మైమరపింపజేయుచుండును.

మీనుమీసముల వంటి పలుచని పదములను దర్భముండ్లవంటి గీర్వాణ పదములను మేళవించి నిపుణముగ కథను నిర్వహించుచు చవితి చందురునివంటి నిగమశర్మను రాకాచంద్రునిగ నొనరించి పాఠకుల స్వాంతములం దతని కొక గౌరవ స్థానము కల్పించుటయందీ కవి ప్రదర్శించిన జాణతనము ప్రశంసనీయము. సుశీల కథయందలి యాతని శైలి యాద్యంతము నీటి డొంకలవలె చిత్తములందు తెరలు తెరలుగ వ్యాపించి గిలిగింతలు పెట్టించుచుండును.

కద్రూజాంగదుడు (శివుడు) ఆదికపి (ఆదిదేవుడు) కపిలపతుడు (గజాననుడు) కూకలంకత్తులు (కలకరపాటు) ఫలాయతనము (స్వర్గము) వరుణ దంతావళము, రాతికోడుకు (కప్పు) గంగంటి (హద్దు) వంటి క్రొత్త క్రొత్త పదములను కల్పించుటయం దతడు నేర్పరి. మందప్రోయాంద్ర కూరిమి ప్రాణిపందు (కృష్ణుడు) చక్షుః శ్రోత్రకన్యల్ (నాగకన్యలు) పొటిపాటి తిలపోతలు (లేనిపోని యాలోచనలు) వంటి చమత్కార శబ్దములను పోహళించుట యందతడందె వేసిన చేయి. పాలవంటి కలము, కంచంత కాపురము తేనెపూసిన కత్తి, నేతి బీరకాయ, ఈగకు కాటు పాముకు బలి, తన ప్రాణము నిలుపు కన్న ధర్మము గలదే, ఉవిదలకు బుద్ధి పెడతల నుండుగాదె వంటి లోకోక్తులను సామెతలను సందర్భోచితముగ ప్రయోగించి కథలను రక్తి కట్టించుటయందు రామకృష్ణుని ధిషణ శ్లాఘనీయముగ నగుపించుచుండును. వాటియందతని హాస్యప్రియత్వము, పరిహాస తత్త్వము పచ్చని మల్లె తీగల మధ్య మొగ్గతొడిగి తొంగిచూచు మల్లెమొగ్గలవలె దరహాస ధవళిమ లొలుకుచు చెంగలించుచుండును.

ప్రకృతి మధురంబులకు వేషరచన లేల? యను రామకృష్ణుని వాక్యము ఆతని కవిత్వమునకును వర్తించును ఆతనిది. సహజ మధుర కవిత్వము. అది మహోత్కృష్టమైనదని దానికి మన సర్టిఫికెట్టు లనవసరములు. అది విశుద్ధ రత్నఖని. త్రవ్విన కొలది తండములు తండములుగ నందుండి విలువైన రత్నములు బయల్పడుచునే యుండును.

—...—

# అహింస

శ్రీ ఉపాధ్యాయుల రామారావు,
ఎం. ఏ.

అహింసా సిద్ధాంతాన్ని
ఆదర్శంగా వల్లిస్తూ
అమరవీరుల అడుగుజాడలు
అనుసరించాలంటూ
ఉపన్యాసా లిస్తున్నారు.
ఆకాశాన్ని
ఆక్రమించుకున్న
కారుమేఘాలు
అవనీతలాన్ని
అంధకారబంధురం
చేశాయి.
ఆకలి మంటల ఆక్రందనాలు
దిక్కులన్నిటి నలముకొన్నాయి
హాత్ముల సమాధులప్రక్క
ధుకాలలు వెలికాయి
పీడితవర్గ ప్రజా
క్షేమ నినాదాలు
వికటాట్టహాసంచేస్తూ
వెక్కిరింపులు చేస్తున్నాయి.
ఆశావాదం తలయెత్తి
అంతరాళంలో లీనమయ్యింది
అనుభూతుల శాఖలు
అందకుండా పోతున్నాయి.
రాకావాదులు
స్వైరవిహారం చేస్తున్నారు
స్వార్థప్రజాస్వామ్యానికి
పునాదులు వేస్తున్నారు.
ధనికవాదం వాళికి
దాస్యం చేస్తున్నది
దావానల మాన్ని
వ్యాపింపజేస్తున్నది.
పెద్ద-చిన్నలు చెలరేగి
నిలువుదోపిడి చేసుకుంటున్నవి
కంటికి కనిపించని వన్ని
తమ స్వంతం అంటున్నవి.
అధికార పిశాచం
ఆజ్ఞలు జారీచేస్తున్నది
అహంకారం విజృంభించింది
మీదబడుతున్నది.
అమాయికుల కంకాళాలు
ఎగిరెగిరి పడుతున్నవి
అభ్యుదయానికి తామే
ప్రతీకలంటున్నవి.
అవనీతల హాహాకారాలు
అంబర తలాన్నంటుతున్నవి
అమరలోక అహింసామూర్తి
అశ్రువర్షం కురిపిస్తున్నాడు.

—...—

( 15 వ పేజీ తరువాయి )

లమునుండియు గలదు. వేదములందు భగవంతుని భక్త వత్సలత్వముకూడ పేర్కొనబడినది.

"హిం గావ ఇవ గ్రామం యూయుధిర్ వాశ్వాన్
వాశ్రేవ వత్సం సుమనా దుహానా
పతిరివ జాయాం అభినోన్యేతు ధర్తా
దేవః సవితా విశ్వవారః॥"

'గోవులు గ్రామము వైపునకు శీఘ్రముగా పోవునట్లు, రౌతు సమరోత్సాహముతో తన అభిమాన అశ్వముపై కూర్చుండ నేగునట్లు, తన వత్సకు పాలిచ్చుటకై గోవు ఆత్రపడినట్లు, సౌందర్యరాశియైన తన భార్యను కలసికొనుటకై భర్త త్వరపడినట్లు—నిరతిశయ శాశ్వతానంద నిధియైన సూర్యభగవాను డీవిశ్వమున ప్రవేశించు చున్నాడు' అని పై వేదఋక్కుల లోని భావము.

ఇట్లే భాగవతమున భక్తుని హృదయము భగవదైక్యమునకై యారాటపడుట వర్ణింపబడినది

"ఆకలి గొన్న క్రేపులు ర
యంబున నీకలు రాని పక్షులుం
దీకొని తల్లికిన్ మతి వి
డేగతుండగు భర్త కంగజ
వ్యాకుల చిత్తయైన జవ
రాలును దత్తఱమందు భంగి నో
శ్రీకర ! పంకజాక్ష ! నినుఁ
జేరగ నామది కోరెడుంగడే !"

—వేదకాలమునాటి భక్తి భావన మాలికముగా ప్రకృతి నారాధించుటతో ప్రారంభమైనది. నాటి మానవ సంఘమున గల దైవచింతన యొక్క స్వరూప స్వభావములు స్థూలముగా నిందు వ్యక్తమగును.

వేదములం దిట్లు భక్తి భావమునకు సంబంధించిన అంశము లన్నియు బీజరూపమున కన్పట్టుచున్నవి.

[ఆంధ్ర విశ్వవిద్యాలయము తెలుగు శాఖలో శ్రీమతి డా॥కోలవెన్ను మలయవాసినిగారి పర్యవేక్షణలో నే చేయుచున్న 'భాగవతము-భక్తితత్త్వము' అను పరిశోధ నాంశమునకు సంబంధించిన వ్యాసమిది. వారికి నానమస్సులు.]

ఆధార గ్రంథాలు.

ఋగ్వేద, యజుర్వేద సంహితలు
సంస్కృతాంధ్ర భాగవతములు.
శ్రీమద్భగవద్గీత.
నారద భక్తి సూత్రములు.
శ్రీ శంకరాచార్య విరచిత 'వివేక చూడామణి'.

—...—

# రచయితలకు మనవి

సంక్షిప్తముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁగాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన కొలఁదిరోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్తపుస్తకములను రివ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంత త్వరలో రివ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,

6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.